శ్రీరస్తు.

# సంపూర్ణ రామాయణము.

ఇది భోజరాజ విరచిత సంస్కృతభాషా కావ్యమునకు

జయంతి రామయ్య, బి. ఏ., బి. యల్.,

రచించిన యాంధ్రానువాదము.









వాణీ ముద్రాక్షరశాల,

బెజవాడ.

1935

శ్రీ ర స్తు.

# చంపూరామాయణము.

ఇది భోజనరవర విరచిత సురభాషా కావ్యమునకు

జయంతి రామయ్య, బి. ఏ., బి. యల్.

రచించిన యాంధ్రానువాదము.







వాణీ ముద్రాక్షరశాల.

బెజవాడ.

1935

కాండమునందు 2 వ పద్యముగను, ఒకటి అయోధ్యాకాండమునందు ౨౮ వ పద్యముగను ఈగ్రంథము నందిమిడియున్నవి. "రఘునాయకు నుత్తరచరిత మిదివరలోఁ జెప్పియుంటిని.ఇప్పుడీ చంపూకావ్యము తెనిఁగించినచో రామకథయంతయుఁ జెప్పినట్లగు" ననునూహ నాకుఁబొడకట్టి భోజచంపువు తెలిఁగింపవలయునను సంకల్పముదయించి క్రమముగా దృఢమయినది. రచన మారంభించి కొద్దిపాటి గ్రంథము తీసికొని వెళ్లి శాస్త్రులుగారికి వినిపింప "రచన బాగున్నది.తప్పక గ్రంథము పూర్తి చేయవలయు" నని వారుత్సాహము కలుగఁజేసిరి. తొలుత శాస్త్రులుగారు మాటవరుస కన్నమాట యుపదేశమయి పట్టిచ్చి యీ గ్రంథరచనమునకు మూలకారణంబయ్యెను. ఇందుకై వారికనేకశతసాహస్ర నమస్కారంబు లర్పించుచున్నాఁడను. నాకుఁదోఁచినరీతి గ్రంథము పూర్తి చేసి ప్రకటించుచున్నాఁడను. ఇందలి గుణాగుణములు రసజ్ఞులు నిర్ణయింతురుగాక.

ప్రకటిత మగుదాఁక నె కృతి కర్త ధనము
పిదప నద్ది సారవిదుల ధనము
కన్నె యయిన కాంత కన్నవారల సొమ్ము
పెండ్లి యైన పిదపఁ బ్రియుని సొమ్ము.

ముక్తీశ్వరము.
యువ సంవత్సర చైత్ర శు ౧ గురువారము. } జయంతి రామయ్య.

# అవతారిక



శా॥ శ్రీవాణీధరణీధరేంద్రతనయాస్త్రీరత్నముల్ నిత్యము౯
శ్రీవక్షోముఖవామభాగముల సంసేవింప స్త్రీపుంసయో
గావిర్భూతసమస్తలోకసముదాయాధారులై యొప్పు నా
శ్రీవత్సాంకహిరణ్యగర్భగిరిశుల్ ప్రేమన్ మమున్ బ్రోవుతన్. ౧

ఉ॥ పుట్టను బుట్టినట్టి మునిపుంగవుఁడాదిగ సంస్కృతంబునన్
బట్టపురాణిగా వలచివచ్చిన భారతి నేలినాతని౯
దొట్టి తెనుంగునందుఁ గలదొడ్డ కవీంద్రులనెల్ల పారమున్
ముట్టిన భక్తితోడుతను మ్రొక్కి నుతించెద మాటిమాటికిన్. ౨

క. గద్యము కాంచనసూత్రము
పద్యంబులు మణిగణంబు పరువడి రెంటిన్
హృద్యంబుగఁ గూర్చిన నన
వద్యంబగు హారమౌను బలుకుం జెలికిన్. 3

ఉ. పంచశరున్ విరాళిగొలుపంగల చేడెలవాఁడి చూడ్కులన్
గొంచెము పిచ్చు జాజిపువుగుత్తుల నంటినకమ్మతెమ్మెరన్
గాంచనగర్భురాణి కరకంజమునందలి చిల్కపల్కులన్
మించినఁగాక కోవిదులు మేలని యెన్నరు కావ్యమెన్నఁడు౯. ౪

క. ఘనుఁడా భోజుండీగతి
నొనరించిన కావ్యరాజ మొప్పుగ నాంధ్రిం
బొనరించుట దుష్కరమై
నను నానేరుచు తెలుంగునన్ దెలిఁగింతున్. ౫

గీ. శబ్దములకంటె నర్థముల్ సమధికంబు
లర్థములకంటె భావంబు లధికమరయ

భావకలనచేఁ బ్రభవించు భవ్యరసము
రసము కృతులకు జీవమై యొసఁగుఁ గాన. ౬

ఉ. దీటుగ సంస్కృతంబునకుఁ దెల్గొనరించెడువారు మూలమున్
దాఁటక భావమున్ రసము తప్పక వచ్చెడునట్లు లెంతయున్
దేటగ వేఱు మాటలను దెల్పినఁ బొల్పగుఁ గాక యెట్టులో
మాటకు మాటపెట్టి యొకమాడ్కిని మాటిన మెత్తురే బుధుల్. ౭

గీ. పలుకుబడి వేఱు పదవరిపాటి వేఱు
రీతులును వేఱ యన్వయరీతి వేఱు
భాషభాషకు ననుమాట భావమందుఁ
జేర్చి సంస్కృతమును దెల్గు సేయవలయు. ౮

క. తెలుఁగున నై పుట్టె నీకృతి
తొలుతన నెడు భావమాత్రఁ దోఁచెడుభంగిన్
జెలఁగిన యనువాదము సర
సుల కింపౌఁ గాక యున్న శోభింప దిలన్. ౯

వ. కృతిముఖంబున నస్మదీయవంశక్రమంబించుక సూచించెద.

శా. శశ్వద్గర్వితమానిసంస్తుత తపస్సంజాత భాస్వద్యశః
ప్రశ్వేతాంశు కళావిహారసదన ప్రాయాష్టదిఙ్మధ్యభా
గ్విశ్వోత్సారిత సర్వపాతక తమోబీజైక సంవేద్యుఁడౌ
విశ్వామిత్రమునీంద్రచంద్రుఁడలరున్ విఖ్యాతతేజుండిలన్. ౧౦

గీ. వినుతకౌశిక గోత్రజ విప్రులందు
నలరు వెలనాటి వారను నట్టిశాఖ
వెలయు వెలనాటిశాఖలో వలజయంతి
వారునానొప్పు విఖ్యాతవంశమొకటి. ౧౧

సీ. ప్రథితమైన జయంతివంశమందునఁ బుట్టె
నరసింహశాస్త్రి నాఁబరగు బుధుఁడు

నరసింహశాస్త్రికి నందనుండుదయించె
దేవప్పనానొప్ప ధీయుతుండు
దేవప్పకను మహాదేవుండు రాజన్న
ముత్తన్న యనునట్టి ముగురు సుతుల
ముత్తన్న గాంచెను ముగ్గురు తనయుల
లక్ష్మీసమానయౌ లక్ష్మమాంబ

వలనఁ బేరయ్య బుచ్చెన్న బ్రహ్మనయన
వెలయువారల వారిలోఁ బెద్దయైన
పేరయార్యుండు కాంచెను గౌరమాంబ
యందు రామయ్య వెంకయ్య యనెడుసుతుల ౧౨

క. రామార్యుఁడు సాధ్వీమణి
సోమాంబికయందిరువుర సుతులన్ గనియెన్
ధీమహితుఁ బేరయార్యుని
రామయనానొప్ప పేర రాజిలు నన్నున్. ౧౩

గీ. తండ్రి పినతండ్రి బుచ్చెన్న ధర్మపత్ని
కామమాంబికతోఁ గూడి ప్రేమమీఱ
నన్నుఁ బుత్త్రి భావమునఁ గైకొన్న కతనఁ
దనయుఁడనయితి వారికి ధర్మయుక్తి. ౧౪

శ్రీరామ
శుభమస్తు.

# చంపూ రామాయణము

## బాలకాండము



### —*అవతారిక*—

ఉ. శ్రీల నొసంగు మాకు సరసీరుహచారువిలాసచోర మా
భీలతరాంత రాయనగభేదనకృచ్ఛితధారసార మా
మూలవిశుద్ధవేదమయభూజశిఖాంచితపల్లవంబు కెం
డాలముఖాభిధానరఘునాథపదద్వయ మెల్లవేళలన్. ౧

ఉ. ధారుణిలోన సద్గతినిదానము ధర్మమయేని దాని కా
ధార మపౌరుషోక్తికలితంబగు వేదమ యేని వేదము
న్నేరిచి యర్థరాసలిని నిల్పెడువారలు పాలు లేని నా
పాలురుఁ గాక యింకఁ బెఱవారల నెవ్వరిఁ జేరు మన్నతుల్. ౨

గీ. వాద్యకలిత మహాగాత్రంపుఁబాట వోలె
గద్యయుక్తమై వెలుఁగొందు పద్యసూక్తి
హృద్య మగుఁ గావ్యరసజుష్టహృదయులకును
గానఁ జంపూప్రబంధ మేఁ గడఁగి కూర్తు. 3

గీ. ఖ్యాతవల్మీకభవమహానిగమరాము
కీర్తిలేశాళి బుధులకుఁ గూర్తు ముదము
ఘనభగీరథానీతగంగాజలంబు
చేత జన మిష్టపితృతృప్తి చేయుఁగాదె. ౪

గీ. ప్రథమకవి యైనవల్మీకభవమహర్షి
నారదుఁడు చెప్పినది పీనులార వినుచుఁ

దివిరి మధ్యాహ్నసవనంబు దీర్చిపోయెఁ
దమము నడఁపంజాలెడు పుణ్యతమసరసి ౫

గీ. అరిగి యటఁ బంచశరవిద్ధమైనయట్టి
క్రౌంచమిథునంబునం దొక్క ఖగము నట్టి
వ్యాధుఁ డొక్కఁడు వేధింప నధికమైన
వగను జెందిన యమ్మౌని మొగిమునుండి. ౬

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్.

గ. అనుఛందోమయసరస్వతి వెలువడెను. వాల్మీకియు సమయోచితకృత్యంబుల నిర్వర్తించి నిజాశ్రమంబుచేరి యందుండె.

గీ. వివిధవిశ్వేంద్రజాలప్రవృత్తికార్య
ఘటకమైనట్టి పింఛంబుకిరణిఁ దనరు
శక్తినొప్పెడు బ్రహ్మ యచ్చటికి వచ్చె
వాణి యొరుఁ గూడఁగా సైఁపలేని పగిది. ౭

గ. వచ్చి యమ్మహర్షి హర్షపూర్వకంబుగా నొసఁగు పూజ లందుకొని "మధ్యమలోకంబునంగూడ నిజవృత్తంబుం బ్రకాశింపంజేయు తలంపునం బోలె నిన్ననువర్తించి యున్న యీ భారతీ మూలంబున రామచరితంబు యథాశ్రుతంబుగాఁ బ్రపంచింపు" మని చెప్ప పద్మయోని యంతర్ధానుం డయ్యె, నంత.

గీ. రాముచరితంబు కరబదరంబుగాఁగ
యోగదృష్టిఁ గని యజునియోగ మూని
రుచిరరామాయణంబుగా రచనచేసె
మధురకృతిమార్గదర్శి యామౌనివరుఁడు. ౮

గ. ఈగతి రామాయణంబు రచించి "దీనిం బఠించుసమర్థు లెవ్వరో" యనిచింతించు చుండ.

గీ. వివిధనరపాలలక్షణోపేతు లఖిల
శాస్త్రవిదులు సుస్వరయుతు లమసురూపు

లైనయట్టి కుశీలవు లప్పు డిద్ద
అరుగుదెంచిరి కుశలవు లనెడువారు. ౯

గ. వారి నిద్దఱ శిష్యులుగాఁ జేకొని యమ్మహర్షి వారిచే నా గ్రంథం బంతయుం బఠింపింప వా రద్దాని నేర్చి యక్కడక్కడఁ బాడుచు రామభవనంబునకుం బోవ భ్రాతృపరివృతుం డై రఘుపతి నిజ చరిత్రం బెల్ల పఠింపుఁ డని నియోగింప.

ఆ.వె. పద్యవిద్య కెల్ల నాద్యుఁడౌ మునివర్యు
శిష్యులైన యల్ల శిశువు లిద్ద
అఘవినాశక మగు రఘువీరచరితంబు
పాడి రాదినుండి వరుస నిట్లు. ౧౦

—* కథాప్రారంభము. *—

గీ. తనరు భాసుర కోసల ధరణియందు
లసదయోధ్యాభిధానవిలాసధాని
చండశాసనోత్సారితసకలవికట
రాక్షసవిహారరఘువీరరాజధాని. ౧౧

గీ. అందు నివసించు బృందారకారివిజయ
లబ్ధమందారమాలోపలబ్ధసురభి
వాసుఁ డమరాధిపార్పితార్ధాసనుండు
దండివీరుల వీరుండు దశరథుండు. ౧౨

గ. ఆ రాజు సంతానంబు లేమికి మిగుల సంతాపంబు నొంది మంత్రులతో నాలోచించి పుత్త్రార్థం బశ్వమేధయాగం బొనర్ప నిశ్చయించినంత సుమంత్రుండు వచ్చి పూర్వ మంగదేశమం దవగ్రహముం బాపంగలిగినవిభండకసుతు ఋశ్యశృంగుని ప్రసాదంబునం దప్పక పుత్త్రోత్పత్తి యగు నని తొల్లి సనత్కుమారుండు చెప్పెనని చెప్ప, భూమీశ్వరుండు చింతవీడి శాంతాజాని రావించి వసిష్ఠానుమతిని సరయూతీరంబునం దశ్వమేధం బొనర్ప సమకట్టి తొలుతఁ బుత్త్రీయేష్టి యొనర్పం దొడంగె. అంత నా క్రతువునందు హవిర్భాగంబులం గొన భూభాగంబున కవతరించు శతముఖప్రము

ఖగీర్వాణగణంబులు దశముఖప్రతాపగ్రీష్మోష్మసంప్లోషణంబు చతుర్ముఖున కావేదించి యాతనిం గూడి శరణ్యుం డగు శార్ఙ్గధరుం జూడఁ బాలసముద్రముం జేరి యచ్చట.

—* సురలు నారాయణు దర్శించుట. *—

సీ. కరుణాప మై శార్ఙ్గకార్ముకోపేత మై
లక్ష్మీతటిల్లతాలలిత మగుచు
మునిమనశ్చాతకామోద మై సకలజ
గత్తాపసంహారకంబు నగుచు
నతసీసుమచ్ఛాయయుతచారుకాయ మై
వైకుంఠనామసువ్యక్తి నగుచుఁ
గువలయానందంబు గురుతరంబుగఁ జేయు
కాలాంబుదం బౌచుఁ గ్రాలువానిఁ
గాయరుచిచేత నంభోధిగర్భమునకుఁ
గువలయాద్వైతభావంబు గూర్చువాని
నిఖిలలోకరక్షణవినిర్నిద్రుఁ డగుచు
భుజగశయనంబుపై నిద్రవోవువాని. ౧౩

చ. నరహరిరూప మై దనుజనాథునురమ్ముఁ దనర్చునమ్మలం
బరు దగునట్టి సర్వదితిజావళిదంభము నుక్కడఁగంబమున్
విరియఁగ నేకకాలమున భిన్న మొనర్పఁగ బద్ధదీక్షుఁడై
సురచిరదంతకాంతిని వసుంధరఁ దెల్పొనరించు దేవునిన్. ౧౪

గ. కని.

క. నలినాయతలోచనునకు
నలినోద్భవజన్మదేశనాభీపుటికిన్
బలివైభవహారునకు నం
జలి యిదె నారాయణాఖ్యసర్వాత్మునకున్. ౧౫

గ. అనుచు బహుభంగుల నుతించు హరిహయప్రముఖాఖిలామరలోకంబు నరవిందలోచనుం డరుణారవిందవిలాసచోరలోచనమరీచిసంచయంబుచే నానందింపం జేసి.

గీ. కుశలమే మీకు సురలార కులిశకేళి
శమితదనుజాళిదంభమై యమరు నొక్కొ
దిషణధీజాతనీతిచేఁ ద్రిదశనగరి
వఱలునొక్కొ యోగక్షేమవంత మగుచు. ౧౬

వ. అని కుశలప్రశ్నం బానర్పు నమృతాసారసరసం బగునవ్వాక్యంబు విని సంపూర్ణమనోరథు లయి సుర లాపరమాత్మున కిట్లని నివేదించిరి.

"దేవ. భవత్కృపావలంబనుల మగుమాకుఁ గుశలంబు గాక యేమి? కాని—

గీ. నిర్జరాలంఘ్య మత్యంతదుర్జయంబు
లంక నా నొప్పు రాక్షసరాజధాని
భవనమణిగణరుచులచేఁ బగటిదీప
మటులఁ గావించుఁ దేజస్త్రయంబు నద్ది. ౧౭

గీ. శ్రీలు దనరారు నాపురం బేలు సాల
వృక్షసన్నిభభుజజితయక్షభర్త
జగము లవలీలగా గెల్వఁ జాలునట్టి
రక్కసులఱేఁడు రావణుం డక్కజుండు. ౧౮

ఉ. ఆతతబాహురాహురసనాయితహేతినివాతశాతధా
రాతతిచే గ్రసించు నలరక్కసి దిక్పతికీర్తిచంద్రునిన్
ఖ్యాతతదీయసంగరముఖసితవైరిశరణ్యుఁడైనవాఁ
డీతపనాత్మజు న్విడిచి యెక్కడ లేఁ డొరుఁ డెంత చూచినన్. ౧౯

గీ. ఆతఁ డీజలజాతసంజాతుఁ గూర్చి
యరిదితపము గావించి యనన్యలభ్య
వరము సాధించి యద్దానిబలముచేత
జగముఁ దనయాజ్ఞ కెల్ల లక్ష్యంబు చేసె. ౨౦

వ. వానిమూలంబున మే మస్వతంత్రుల మైతిమి. ఆతం డవరోధవధూజనసహితుం డై క్రీడాశైలశిఖరంబున సంచరించునప్పు డాత్మీయకర

ప్రసారం బుండెనేని నపరాధం బగు ననుభీతి నీసహస్రభానుండు సంకుచితభానుం డై శైలసానుప్రదేశంబుల నాశ్రయించి యుండు, నీసుధాంశుండును నప్పాలస్స్యుండు మృగయాయాసపరిశ్రాంతి విశ్రాంతికై నమజ్జనపరివృతుం డై మజ్జన గృహంబుం జేర నందు శాతకుంభ స్తంభాగ్రకీలితస్ఫటికశిలాసాలభంజికాపుంజకరతల శశి కాంతమయ కలశపుంజంబునం దాత్మీయకరాభిమర్శంబున నచ్ఛా వచ్ఛిన్నధారాంబుధారాచయంబుం గల్పించి సునాసీరచిరకాం క్షిత ప్రసాదపిశునవింశతివీక్షణంబులకు క్షణమాత్రంబు పాత్రం బగు. మఱియు నారావణుండు సంక్రందననందనవనంబునుండి తెచ్చి తనయుద్యానవనంబున నాటించిన మందారాది బృందార కతరుబృందంబుల యాలవాలంబులు చెఱలో నున్నసురనారీజనం బులనయనేందీవరంబులనుండియుఁ గరారవిందకలితకనకకలశం బులనుండియు స్రవించుమందోష్ణాంబుధారలచేఁ బంకిలంబులుగా వానియందుఁ బచేళిమంబు లగుకుసుమంబులు పడు ననుభయంబు చే నీగంధవహుండు కదలుటకుం గూడ జంకుచున్నవాఁడు. ఇంతకు ముందు హుతవహోఖ్యులై పెంపొందిన యీగార్హపత్యపురోగాగ్ను లిప్డు డాదశముఖునింట మహానసాధ్యక్షులై యున్నవారు. మాన వులవలనం దన కవమానంబు కలుగు నని తలంపక యానిలింప వైరి మానవేతరులచేఁ జావకుండునట్లు చతురాననుచే వరంబు నొంది సంప్రహారసమాక్రాంతదిగంతదంతావళదంతకుంతవ్రణకిణ స్థపుటితవక్షఃస్థలుం డై వనగజంబు స్థలకమలినిం బోలె ముల్లో కంబులం గాసించుచు మేము నీవారల మని కూడ నెఱుంగకున్న వాఁడు.” ఇట్లని దేవతలు నివేదింప నాకర్ణించి.

ఆ.వె. నీలశైలమందు బాలేందుకళలీల
మొగమునందు లేఁతనగవు దోఁపఁ
దేనె లొలుకు తియ్యతియ్యనౌపలుకుల
సురల కిట్లను మధుసూదనుండు. ౨౦

గ. “మిమ్ము బాధించుచున్న యాయాతుధాను నిప్పుడే యుష్మదాశ్రమంబున సమయింపం దగు నయిన సరసిజాసనువరంబును బుత్రార్థి యైన

సుమిత్రామిత్రదశరథమనోరథంబును సఫలంబు లగునటులు నేను మానుషవేషధారి నై వానిం ద్రుంపం దలంచితి" నని చెప్పి యంతర్ధానుం డయ్యె. సురగణంబును హృషీకేశాదేశంబునం జతుర్దశ భువనంబులు నిర్దశాననంబులుం బ్రశమితదుర్దశంబులు నయ్యె నని పొంగి సుధాసాగరంబు వీడి నిజాగారంబులకుం జనియె. పితామహుం డాదేవతలతో "భూలోకంబునం దవతరింప నై యున్నలక్ష్మీసహాయునకు సహాయంబుగా మీర లప్సరఃప్రభృతి యువతుల యందు వానర భల్లూక గోపుచ్ఛాదిరూపంబులం బ్రథితప్రభావు లైనకొడుకులం గనవలయు. తొల్లి యొక్కప్పుడు నే నావులించి నప్పు డుత్పన్నుం డై నజాంబవంతుం డిప్పుడు నున్నవాఁడుగదా!" యని చెప్పిన సుర లాప్రకారం బాచరించిరి. అంతఁ గొంతకాలంబునకు సవనాగ్నికుండంబునుండి ప్రజాపతిప్రేషితుం డగు పురుషుం డొకం డుద్భవించి హేమపాత్రంబుతో నమృతప్రాయ పాయసంబు పుత్రార్థి యైనదశరథున కొసంగ.

గీ. అందు సగపాలు కౌసల్య కాది నిచ్చి
పిదప సగ మిచ్చెఁ గైకకుఁ బ్రీతి రాజు
వారు పతిభావ మెఱిఁగి సపత్ని కంత
సగ మొసంగిరి తమతమసగమునందు. ౨౨

గీ. అవభృథస్నాన మవసితం బగుడు నెల్ల
జనులుఁ దమతమయిండ్లకుఁ జనిరి దశర
థేశ్వరుండును సంతుష్టహృదయుఁ డగుచు
నమరపురిఁ బోలునిజపురి కరిగె నంత. ౨౩

గీ. రాజభార్యలు ముగురకుఁ గ్రమముగాను
గర్భచిహ్నముల్ వ్యక్తమై కానవయ్యెఁ
బొడమె నలసత హెచ్చయ్యె నొడలికాంతి
భార మయ్యెను మిగుల నాభరణచయము. ౨౪

క. విడివడె వళుల్ క్రమంబుగ
నడుమును గానంగ వచ్చె నాభియును బయల్

పడియెను గౌసల్యకు న
ప్పుడు నిజనాథుండు మిగులఁ బొంగుచునుండన్ . ౨౭

గీ. సుదతియుదరంబు వటపత్రసోదరతను
గ్రమముగా వీడి యుండియుఁ గాంచె మరల
దశముఖోరగసందష్టధరణిజనుల
మనుప విష్ణుండు గర్భ మై తనరు కతన. ౨౮.

గీ. సూక్ష్మమై కానరాకుంట సుదతికౌను
తొలుత నాకాశసామ్యంబు కలిగి యుండెఁ
జాలు గలుగుటచే నిప్డు స్థూల మయ్యు
విష్ణుపద మాట మిన్నె యై వెలసె మరల. ౨౯

—* శ్రీరామజననము *—

గ. అంత.

సీ. గ్రహపంచకం బుచ్చగతులయం దుండంగ
గురుఁడును జంద్రుండుఁ గూడియుండ
బూషుండు నెలకొని మేషంబునం దుండఁ
గర్కటకాఖ్యలగ్నంబు దనర
శుక్లపక్షమునందు శుభపునర్వసునామ
నక్షత్రయు క్త మౌనవమియందు
మేధ్య మైనట్టియయోధ్యాభిధారణి
నవ్యయంబు నఖండ మైనయట్టి
యట్టి దిట్టిది యనరాక యమరునట్టి
కడునపూర్వంబుఁ బరము నై గ్రాలునట్టి
తేజ మొక్కటి పొడసూపి తేజరిల్లె
ఖరపలాశసమిత్తతిఁ గాల్చిపొంటె. ౩౦

క. ఆదికవీశ్వరకావ్యా
మోదము నా నొప్పురామమోహనరూపం
బాదరమున బూని మహిత
మా దయతో హరి రఘుకులమందు జనించెన్. ౩౧

క. అన్ని సుగుణజాలంబుల
నన్నను బోలంగఁజాలు ననుజులు మూవుర్
గ్రన్నన నుద్భవమందిరి
పన్నుగఁ ద్రేతాగ్నిదీప్తిఁ బరఁగెడువారల్. ౩౦

క. వినయోజ్జ్వలుఁ డగుభరతుం
డనఘుఁడు జన్మించెఁ గేకయాత్మజకున్ల
క్ష్మణశత్రుఘ్నాభిధులా
ఘను లుదయించిరి సుమిత్రగర్భమునందున్. ౩౧

క. లోకానందకరుం డగు
శ్రీకాంతాదయితు నాల్గుచేతులరీతిన్
లోకక్షేమంకరతం
గైకొని వర్ధిల్లి రల్లనలువురు వీరుల్. ౩౨

గ. అపరిమేయ మాయాభయానక యుద్ధసముద్ధత దైత్యబలావస్కంద కాందిశీక బృందారకానీక పరివార్యమాణరథుం డగు పంక్తిరథుం డట్లు సంప్రాప్తమనోరథుండై యుండఁ గొంతకాలంబున కాతని కడకుఁ దపఃప్రభావజనితానేకాశ్చర్య నిదానుండును, త్రిశంకు యాజకుండును, పద్యప్రబంధంబు పగిది దర్శితసర్గభేదుండును, ప్రాకృతవ్యాకరణంబుకరణిఁ బ్రకటితవర్ణవ్యత్యాసుండును, బుధునివిధంబున సోమసుతుండు నగుకుశికసుతుండు వచ్చి యథావిధి సత్కృతుండై యాతనితో "రాజా! శరాసనమాత్రమిత్రుండును, సౌమిత్రిమాత్రపరిజనుండును, వినయాభిరాముండు నగు నీ తనయుండు రాముండు నేనోర్పంబూనిన క్రతువును రాక్షసులు విఘ్నంబుచేయకుండ రక్షింపవలయునని యభిలషించుచున్నాఁడ" నని పలుక నాకర్ణపరుషవాక్యమ్ము నాకర్ణించి యతిమాత్రపుత్రవాత్సల్యుండగు నా కౌసల్యాజాని సశల్యాంతఃకరణుండై కొడుకులం బాయంజాలనని యెంత చెప్పినను గాధినందనుం డపరిహార్యనిశ్చయుండై యుండంజూచి తపనకులపురోహితుండగు వసిష్ఠుండు.

క. లోకోత్తర భాగ్యుండై
నీకౌశికు గౌరవించి యిలలో దనుజా

నీకము నిర్మూలంబుం
బ్రాకటముగఁ జేయఁ బంపు రామునిఁ దమ్మున్. 33

గ.అని యనుశాసింప దశరథుండు ధైర్యం బవలంబించి సుతుల గాధిసుతుతో నంప నంగీకరించె నంత.

—• రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నరుగుట •—

క. యోగముచే సంసార వి
యోగముఁ గన్నట్టివార లొందఁగల మహా
భాగుఁడు రాముఁడు జనకు ని
యోగముచే గాధిసూను నోడఁగూడి చనెన్. 34

గీ. యజ్ఞరక్షకై రాముని ననుజుఁ దోడు
కొని చనుచు మౌని రామునితో ననియె నిట్లు
బలయు నతిబలయు నను రెండలఘువిద్య
లలరు నీ కిచ్చెదను వాని నందికొనుము. 35

గ. అని చెప్పి యాబలాతిబలావిద్యలం బ్రసాదించి యంత నొక్కప్రదేశంబు చూపి విశ్వామిత్రుండు దశరథాగ్ర పుత్రునితో నిట్లనియె.

గీ. తొల్లి యిచ్చోట నల రతివల్లభుండు
త్రిపురహరు ఫాలలోచనదీప్తియందు
మిడుతవలెఁ బడి యంగంబు విడిచెఁ గాన
నంగసంజ్ఞచే నీదేశ మమరుచుండు. 36

గ. తదనంతరంబు మానససరఃప్రసృతంబగు సరయూనది నతిక్రమించి వృద్ధశ్రవుండు వృత్రవధోత్పన్నంబగు మలముం దొలంచుటచే మలదకరూశంబులని పేర్వడ్డ ప్రదేశంబులం జేరి యమ్ముని పతి దశరథసుతులతో నిట్లనియె.

—• తాటకా వృత్తాంతము •—

గీ. మును సుకేతుఁడన్యక్షుఁడు వనజభవుని
దయను దాటక నా నొప్పుతనయఁ బడసె

దాని సుందుండు పెండ్లియై దానియందు
నీచుఁడైనట్టి పుత్రు మారీచుఁగనియె. 3౭

గ. అంతఁ గొంతకాలంబునకు సుందుం డగస్త్యుచే నిహతుండగుడు మారీచుం డాక్రోధంబున నక్కుంభసంభవు నభిభవించి యమ్ముని శాపనమ్మున రాక్షసత్వమ్ముఁ నొందె. తాటకయు మనుష్యాశినియుఁ జతుర్ముఖవరప్రభావంబున వేయిజగంబుల బలంబు గలదియునై నీచుండగు మారీచునితోఁ గూడి లోకంబులకు శోకం బాపాదించుచున్నయది కాన దానివధము నీకుఁ గర్తవ్యంబని రామునితోఁ జెప్పి రామను సమయించు టెట్లని సంశయించుచున్న యాతని సందేహముం దొల్లి పురందరుండు వసుంధరాపరాధ ధురంధరయగు మంధరను, పరశురామావతారుండగు జనార్దనుండు నిజజననిం జంపిన వృత్తాంతకథనంబుచేఁ బరిహరించె.

గీ. అట్లు వృత్తాంత మంతయు నాలకించి
తాటక వధింప రాముండు తలఁచె మదిని
నాతలంపునె యెల్లర కతసిధనువు
జ్యారవం బనుమిషచేతఁ జాటచెప్పె. 3౮

గ. అంత.

గీ. జీవసంహార మెల్లఁ దాఁజేసి యమభ
టులకు విశ్రాంతిగావించు పొలసుఁదిండి
యసురనాశంబు సూచించు నట్టిసంధ్య
యనఁగ రుధిరారుణాస్యయై యడ్డె మునిని. 3౯

గీ. క్రూరయైనట్టి తాటకగుణము రాము
చెవిని సోఁకిన యపుడ యా చెఁనటిఁజంపఁ
గోరి రాము శరాసనగుణము గూడ
శీఘ్రముగ రఘువీరుని చెవిని జేరె. ౪౦

గీ. భావిభయదోగ్రసంగ్రామ బద్ధదీక్షుఁ
డైన రాముని ఘనతీవ్రబాణమునకుఁ

దనదు ప్రాణపంచకమును దత్త్రాణంబ
వీరపాణంబుగా నిచ్చె ఘోరదనుజ. ౪౧

గీ. ఘనభృశాశ్వుండు తొలుదొల్లఁ గన్నయట్టి
జృంభకాద్యస్త్రముల్ మునిజంభవైరి
జంభపిశునాశశాసన శాసనమునఁ
దాటకారాతి కొసఁగెను దయ దలిర్ప. ౪౨

క. పిదప విరించిలోకప్రత్యాదేశంబగు నొక్కప్రదేశంబుం జూపి యమ్మునివల్లభుం డిట్లనియె.

గీ. బ్రహ్మనిష్ఠమై భవఖేదరాశిఁ బాసి
నట్టిమునులు సేవించు నీయడవియందు
బలినియమననిమిత్తమై వామనుండు
బలినియమపరుండౌచు నివాసముండె. ౪౩

గీ. నిఖిలలోకైకభిక్షుండు నిర్జరార్తి
హర్తయును నైన వామనునాశ్రమ మిది
నీలతరుజాల మిట నిదె నింగి ముట్టఁ
గువలయంబును స్వాయముగాఁ గొలువ ననఁగ. ౪౪

గీ. అట్లు కౌశికముని చెప్పినట్టి పెక్కు
గతుల శ్రుతిహారపావన కథలచేత
దశరథావనీనాథుని తనయులకును
నడకచేఁ గల్గు శ్రమ మింత యడఁగిపోయె. ౪౫

—* విశ్వామిత్రుఁడు సవనంబాసరించుట *—

క. తదనంతరము సిద్ధాశ్రమంబు చేరి కౌశికుండు సత్ర మొనరింప దొడంగుటయు నంతక కింకరులుఫ్రోలె నెంతయు భయంకరులగు రాక్షసు లనేకు లంతరిక్షంబునుండి దిగి యెల్లెడఁ దామమై యుండం గని భీతిల్లి యమ్మునిశిష్యులు చేత నున్నసమిత్కుశలఁ బాఱవైచుచు రఘునాథుం జేరి.

ఉ. అసురసంఘ మెల్లెడల నాడుచుఁ బాడుచు వెక్కిరించుచున్
హాసము చేయుచు న్గిరిశిఖాళిఁ బెకల్చుచు ఖేచరాళికిం

ద్రాస మొనర్చుచు రుధిర ధారల భూతల మెల్ల ముంచుచు
న్వేసట యింత లేక కడువిక్కచుఁ గ్రమ్మె దిగంతరాళముల్. ౭౬
క. అని విన్నవించినంత.
గీ. ప్రాప్తవర్ణాంతరుండైన యట్టిగాధి
సూను సంపర్కపుణ్యంబుచే ననంగ
నాదిఁ బిప్పలదండార్హుఁ డయ్యును రఘు
పతి పలాశదండాదృతపాణి యయ్యె. ౭౭
గీ. నీచమతి యైన మారీచుఁ డేచిపోరి
రామబాణంబు తన్నుగురంగఁ గొట్ట
నుదధిలోఁ బడి భీతిచే నోదిఁగి యుండె
నీటిమానిసి పోలికి నివ్వటిల్ల. ౭౮
గీ. అఖిల మునిజనకంటకుఁడౌ సుబాహు
వాహవోన్మత్తుఁడై తెగి యాజి సల్పి
దాశరథిపృథు బాణ విదళితుఁడగుచు
నంతకునకుఁ దా నంతట నతిథి యయ్యె. ౭౯
గీ. వంశజంబు మనోహారిఫలయుతంబు
నగుచు రామేరితంబు స్నేహాన్వితంబు
నైనశరముతో దనుజజీవాళి యేగె
హృదయమును వీడి రక్తయూ నింతివోలె. ౮౦
మ. సురవైరిప్రకరంబులట్లు సమయన్ క్షోణీహితంబౌనటుల్
వరయాగంబు సమాప్తిచేసి పరమబ్రహ్మణ్యుఁడ మ్మౌని సం
గరజాతన్ జయలక్ష్మిఁ జేకొనిన యాకాకుత్స్థవర్యున్ సద
ధ్వరసంభూతరమావరున్ జలుప సంభావించె డెందంబునన్.

—+ కౌశిక వంశవృత్తాంతము *—

క. పిమ్మట మిథిలానగరంబునకుం జనుచు రఘువరున కాసంయమి వరుండు నిజవంశవృత్తాంతం బిట్లు చెప్పందొడంగె:—

"తొల్లి సరసిజాసనాంశసంభూతుండగు కుశాభిధానరాజర్షి యొక్కండుండె, నాతనికిఁ గౌశాంబీమహోదయ ధర్మారణ్య

గిరివ్రజాఖ్యపురీ నిర్మాతలగు కుశాంబప్రముఖులు నలువురు సుతులుద్భవించిరి. వారలలోఁ గుశనాభుం డను నాతండు ఘృతాచియందు నూర్గురు కూఁతులం గనియె, నా కన్నెలు సన్నద్ధయౌవనలయి యుండఁ బవనుండు వారలఁ గామించి నిరాకృతుండై వారిని వికారాకారలుగా శపించినం గుశనాభుం డది వినియు క్షమాన్వితుండై ప్రతిక్రియ చేయుట మాని యాకన్యల సోమదయను గంధర్వాంగనయందుఁ జూళి యను ముని గనిన బ్రహ్మదత్తుండను రాజున కిచ్చి వివాహంబొనర్ప వార లాజనపతిప్రభావంబుచే యథాపూర్వ రూపాన్విత లైరి. పిదప నాకుశనాభుండు పితృప్రసాదంబున నాజనకు నగాధసత్త్వుండగు గాధిం గనియె"

దాశరథి యేతత్కౌశికోత్పత్తికథాశ్రవణంబుచే రాత్రిని నిమిష మాత్రంబుగాఁ గడపినంత బంధూకస్తబకబంధురం బగు సంధ్యారాగంబు పూర్వదిగంగనాముఖారుణతిలకంబై వెలుంగ శోణనదిలోఁ బ్రత్యూషకృత్యంబులు నిర్వర్తించి కృతనియముండగు సంయమివరుం గూడి గంగాతీరంబునకుం బోవుదారింబట్టి చనిచని.

గీ. చేరి యాజానపావన క్షీరయుతము
ఘనవృషానందసంధాయకంబు నగుచు
శ్రుతిహితంబునై పొలుపొంది శుద్ధమాచు
నావుఁబోలిన యానది నతఁడుగనియె. ౨౭

క. ఆభాగీరథీకథ వినం గోరు రాఘవునకుం గౌశికుఁ డిట్లని చెప్పం
దొడంగె.

సీ. పూర్వకాలమునందు భూధరోత్తముఁడైన
మేరువుతనయ మనోరమయను
కాంత హిమాద్రికిఁ గాంతయై యొప్పారె
వారికిఁ బుట్టిరి వారిజాక్షు
లిరువురు గంగయు గిరిజయు ననువారు
వారిలో గంగ యన్పద్మనయన
నమరులు గొనిపోయి రమరలోకమునకుఁ
బార్వతి నిష్ఠతో వ్రతమునలిపి

పంచవదనునిభార్యయై పరిఢవిల్లె
సీలగళుఁడు సతియు మరుకేళిసల్పు
నపుడు వారివీర్యంబు దా నవనిఁ బడినఁ
బావకుఁడు దాల్చె నమరులప్రార్థనమున. ౫౩

గీ. పుత్రలాభంబు తన కట్టుపొలిసి పోవఁ
బుత్రలాభంబు లేకుండఁబో సురలకుఁ
బలువురకు భార్యగానుండ వసుమతికిని
గోపభారంబుచే గౌరి శాపమిచ్చె. ౫౪

గీ. అంత సేనానిఁ గాంక్షించి యబ్జజాది
సురలు ప్రార్థింప నగ్ని యా గిరిశువీర్య
మమరవాహినియం దుంచె నదియు దానిఁ
దాల్పఁ జాలక పడవైచె దర్భయందు. ౫౫

గీ. ఆశరవణమం దా వేళ నల్లకృత్తి
కలకుఁ బ్రీతిగా నాఱు మొగంబు లలర
వెడలె షాణ్మాతురంబైన వెలుఁ గొకండు
తారకధ్వాంత విధ్వంసకారి యగుచు. ౫౬

క. హవ్యవాహనుండుం బోలెదివ్యవాహినియుఁ ద్రివిధం బదియెట్టులనిన.

సీ. కలఁ డొకనరపతి కమలాప్తవంశ్యుండు
సగరాభిధానుండు సజ్జనుండు
పాలించె భువి యతం డోలి నయోధ్యాభి
ధానపురము రాజధానిగాఁగఁ
గేశినీసుమతులన్ గృహిణులతోఁగూడి
తనయులకై తాను దప మొనర్పఁ
బ్రీతుఁడై మునిపతి భృగు విచ్చె వరమును
బలువురు కొడుకులు గలుగునట్టు
లంత వైదర్భి యైనట్టి యగ్రమహిషి
యనయు నసమంజుఁ డనుపేరి తనయుఁ గనియెఁ

బదపడినృపతి రెండవ భార్యయైన
సుమతి యఱువది వేవుర సుతులఁ గనియె. ౫౭

క. అసమంజసచరితుండౌ
నసమంజుని వెడలఁగొట్టి హయమేధము నా
నెసఁగెడు సవనమ్ము సలుప
వసుధేశుఁడు హయము విడిచె వసుధం దిరుగన్. ౫౮

క. సురపతి యాగాశ్వము నా
సురవరరూపంబుదాల్చి సొరిది హరింప
న్నరవరతనయులు వెదకుచు
ధరణీతల మెల్లఁ దిరిగి దానిం గనమిన్. ౫౯

గీ. గోళ్లతోడుతఁ బుడమిని గ్రొచ్చిగ్రొచ్చి
యురగలోకంబు సొచ్చి యం దుగ్రతపము
సలుపుచున్నట్టి కపిలర్షి యలుకయనెడు
మంటఁబడి మిడుతలమాడ్కి మాఁడిరపుడు. ౬౦

క. జనపతి యప్పుడు తన మను
మని నసమంజసుతు నంశుమంతునితో స
ప్తిని దెచ్చి సప్తతంతువు
కొనముట్టఁగఁ జేయవలయుఁ గుఱ్ఱానాకున్. ౬౧

గీ. అనిన వాఁ డాబిలము వట్టి యరిగి యరిగి
ద్రుంది యున్న పితరుల భస్మంబుఁగాంచి
బాష్పజలనివాపాంజలి వదలి వదలి
యెట్టకేలకు గుఱ్ఱముం బట్టుకొనియె. ౬౨

చ. తురగముఁ దాత కిచ్చుటకుఁ దోడ్కొనివచ్చెడు నంశుమంతుతో
మరణమునొందినట్టి నృపమాళికుమారుల మేనమామయౌ
గరుడుఁడు వచ్చి యిట్లనుచు గంగను నీ విటఁ దెచ్చి ధూళిపైఁ
బఱపిన నీపితృవ్యులకు భవ్యగతు ల్సమకూరు బాలకా. ౬౩

క. మనుమం డీగతిఁ దురగము
గొని వచ్చి యొసంగఁ గ్రతువు కొనముట్టంగా

నొనరిచి సగరుఁడు నిర్భర
తనయవియోగార్తిచేతఁ దనువుం దొఱఁగెన్. ౬౮

గీ. అంశుమంతుండు చిరకాల మవని యేలి
సుతు దిలీపునిఁ బతిఁజేసి సుస్థిరమతిఁ
దపము సలుప హిమాలయతటముఁ జేరెఁ
బదపడి దిలీపుడును దివ్యపదము నొందె. ౬౯

గీ. ధీరుఁడు దిలీపసుతుఁడు భగీరథుండు
వృత్తము న్విని మిన్నేటి నిలకుఁ దేరఁ
గడిఁదితపము సలిపె నంతఁ గరుణతోడ
గిరిశుఁడును గంగ మోయ నంగీకరించె. ౭౦

సీ. వీచీసమూహంబు వియదంతరాళంబుఁ
గకుబంతములుఁ గూడఁ గప్పికొనఁగఁ
జంద్రుండు నక్షత్రజాలంబు నీటిలో
శంఖమౌక్తికముల సరణిఁ దోఁపఁ
దరఁగలు రవిరథ తురగంబులను లాగి
యరుణు నెంతేని నాయాసపెట్ట
నురువులు పైఁ గ్రమ్మ మఱుఁగుగా నున్నట్టి
వెలియేన్గు నింద్రుండు వెదకుచుండ
నందనద్రుమములు నడియేటిలోఁబడి
కొనలు గన్పడఁ గొట్టుకొనుచుఁ బోవ
నెల్లెడ సత్పథం బేకోదకం బౌట
దిఙ్మూఢుఁడై సూర్యదేవుఁడుండ
నావర్తగర్తంబులందు విమానము
ల్తెప్పల పోలికఁ దేలుచుండ
శైవాలగతి నీలజలదాళి దిక్తట
దేశమున్ హత్తుక తేజరిల్ల
సురసరిద్వర మావేళ సూటిగాను
గగనమందుండి యవలేపగరిమ తోఁపఁ

పార్వతీజాని ఘనజటాపటలగహ్వ
రంబులోఁ బడెఁ బృథుల వేగంబుతోడ. ౧౭

క. సురనది యాపగిది మహే
శ్వరుజటలంబడుచుఁ జిక్కి బైటకురాఁగా
దెరువు గనక యట నుండెను
గటికిపరకమీఁది మంచు కణమో యనఁగన్. ౧౮

క. శ్రమపడి తెచ్చిన నది యా
క్రమమున మటుమాయమైన క్ష్మాపతి విఫల
శ్రముఁడౌచుఁ గరము వందురి
ప్రమథాధీశ్వరు నుతించె బహుభంగులుగాన్. ౧౯

గీ. పొగడఁ బ్రీతుఁడై శంభుఁ డాపగను విడువ
బిందుసరమందుఁ బడె నేడువిధము లౌచు
వానిలో మూఁడుపాయలు వాసవాశ
వైపు మఱి మూఁడు పడుమటి వైపుఁ జనియె. ౨౦

క. మిగిలిన యేడవనది యా
భగీరథుని వెంబడించి భాగీరథినాఁ
దగి జహ్నుమౌని సవనపు
జగతిని జుట్టుకొనె గర్వసంరంభమునన్. ౨౧

క. మునిపతి దానిని బీలిచి
జనపతి వేఁడంగ మరల శ్రవణద్వారం
బున విడిచిపెట్ట జాహ్నవి
యనుపేరను బరఁగె నద్దియానాఁడు మొదల్. ౨౨

గీ. జాహ్నవిం దోడుకొనుచు రసాతలంబుఁ
జేరి పితరులఁ ద్రిదివంబుఁ జేర్చి శ్రితమ
నోరథుం డౌచు నపుడు భగీరథుండు
నిజనివాసంబునకు నేఁగెఁ బ్రజలు పొగడ. ౨౩

గ. దాశరథి యంత నాభాగీరథిం దాఁటి చనుచు విశాలయను పురిం
గని యిది యెవ్వరి దని యడుగ గాధినందనుం డిట్లని వక్కాణించె.

పూర్వకాలమున నమృతంబునకై సురాసురులకుఁ బరస్పర
విరోధంబు ప్రాప్తింప విశ్వరూపుండగు విష్ణుండు జగన్మోహినీ
రూపంబు దాల్చి వజ్రపాణిచే దైతేయనిధనం బొనర్పింపం దజ్జనని
యగు దితి యుత్కటకోపావేశయై నిజనాథుండగు కశ్యపు వచ
నంబున శతమన్యు శాసింపం జాలుపుత్రుం బడయంగోరి కుశప్లవం
బునందుఁ జిరతపం బొనర్చె. తత్కాలంబున నింద్రుం డామెం జేరి
కైతవంబున శుశ్రూష యొనర్చుచు నొక్కనాఁ డాదైత్యజనని
పాదకలితకచకలాపయై నిద్రించుచుండ నత్తఱి నామె యపవిత్ర
యని యెఱింగి తజ్జఠరముం జొచ్చి గర్భంబు నేడు వ్రక్కలుగఁ
జీల్చి వెడలిపోయె. దితియు నాసప్తశకలంబుల సప్తమరుత్తులుగ
నింద్రుచేతన చేయించి త్రివిష్టపమున కేగె. పిదపఁ గొంతకాలంబున
కాకుశప్లవము ఖిలమైపోవఁ దత్స్థానంబున.

క. ఘనుఁ డిక్ష్వాకుఁ డలంబుస
యనియెడు సతియందుఁ గన్నయట్టి తనూజుం
డనఘుండు విశాలాఖ్యుఁడు
తనపేరను నీపురంబుఁ దనరఁగఁ జేసెన్. 28

గ. అని విశాలాపురంబువృత్తాంతంబు సవిస్తరముగాఁ జెప్పుచు
నమ్మౌనివరుండు తత్పట్టనాధీశుండగు సుమతిచే నొనర్పంబడు
సత్కారంబుల నందుచు నారాత్రి యచ్చటఁ గడపి మఱునాఁడు
రాజపుత్రులం దోడ్కొని మిథిలాపురంబునకై పోవుచు మార్గ
మధ్యంబునం దాపసోత్తముండగు గౌతము నాశ్రమంబుం గని
యమ్మునిదారానుషక్తంబగుకథ యిట్లని చెప్పె.

గీ. తొల్లి యిచ్చోటఁ బూర్వదిగ్వల్లభుండు
గౌతమాంగనఁ గూడెఁ దా గర్వరీతి
ఋషియు వృషణహీనుండుగా నింద్రునకును
శైలి యగునట్లు భార్యకు శాపమిచ్చె. 29

క. సతి వేడఁగ సంయమి రఘు
పతి తా నిక్కాన కెపుడు వచ్చునో యపుడే

గతశాప వౌదువీవని
హితముగఁ బల్కి తపమునకు హిమగిరి కేగెఁ. 26

గీ. వాసవుఁడు పితృదేవతా ప్రాభవంబు
వలన మేషాండకోశంబు వడసె మరల
రమ్యభవదీయపదయుగరజము చేతఁ
బూతయావతి నేలుఁబో గౌతముండు. 27

క. అని యిటు లహల్యవృత్తం
బు నుడువుచు రఘుకులపుంగవుఁడు వెనువెంటం
జనఁగఁ జని గౌతమాశ్రమ
మును జేరెం గౌశికాఖ్య మునిపుంగవుఁడున్. 28

గీ. రజము చేతను దొలుదొల్త రాయియయ్యె
రామపదరజంబున వెండి రామయయ్యెఁ
గాన దుఃఖంబునకును సుఖంబునకును
గౌతమాంగనకు రజము హేతువయ్యె. 29

గ. ఆయాశ్రమంబున నహల్యాగౌతముల చేఁ గృతసత్కారుండై కౌశికుఁడు రామలక్ష్మణులతోఁ గూడి మిథిలాపురోపకంఠంబున జనకుని యజ్ఞవాటికం జేరి యానరపతి యొసంగిన సపర్యలం గైకొనియుండ నిమికులపురోధసుండగు శతానందుండు రామునితో విశ్వామిత్రు వృత్తాంతంబు చెప్ప నిట్లుపక్రమించె.

*— విశ్వామిత్రచరిత్రము. *—

సీ. వెనుక నీమునిపతి వినుతసత్క్షత్రియ
వృత్తిమై నున్నట్టివేళ యందుఁ
బద్మగర్భునిపట్టి వరవసిష్ఠాహ్వయు
నాశ్రమంబున కేగి యతిథి యాచు
నతులిత మైనట్టి యాతిథ్యమును బొంది
యదియెల్ల సురభి మాహాత్మ్యమనుచు
నెఱిఁగి దానిని వేఁడ ఋషియియ్యకొనమిచేఁ
బలిమి నాయావును బట్టి లాగ

నార్చుచున్నట్టి దాని దేహంబునుండి
ప్రబలబలములు పెక్కులు బయలువెడలి
తాఁకి తనతోడఁ బెనఁగంగఁ దాళలేక
పాఱిపోయెను నీముని బవర ముడిగి. ౮౦

వ. అట్లు పాఱి పోయియు మరల మరల వచ్చి పెక్కుసారులు సమర మొనర్చియుఁ దపోలబ్ధంబులయిన తనదివ్యాస్త్రంబు లన్నియు నవ్వసిష్ఠప్రయుక్తబ్రహ్మదండంబుచే నిహతంబు లగుటచే విషాదంబు నొంది క్షాత్రబలంబుకంటె బ్రహ్మతేజంబ యధికంబని నిశ్చయించి తత్తేజస్సిద్ధికై దక్షిణదిశయందుఁ దీవ్రతపం బొనర్చె. అంత సూర్యకులసంభవుండగు త్రిశంకునామనరపతి సశరీరంబుగా స్వర్గంబునకుఁ బోవుటకై యజ్ఞం బొక్కటి చేయంబూని యాసవనంబు సేయింపుమని వసిష్ఠుని వేఁడి ప్రత్యాఖ్యాతుండై తప్పక చేయింపవలయునని యమ్మునివరుతనయుల న్బాధింప వారలిగి చండాలుండవు గమ్మని శపించుడు నారాజంత నీకౌశికు నాశ్రయించె. ఇమ్మునివరుం డాజనవరుచే సవనంబు చేయించుచుండ బ్రహ్మర్షులు పలువురు వచ్చినను వసిష్ఠపుత్రులు రామింజేసి యలిగి వారల శ్వభక్షకులుగా శపించి హావిర్భాగంబులం గొనుటకు దేవతలు రాకుండుటంజూచి.

గీ. ఆతతతపఃప్రభావంబుచేత నితఁడు
రూఢనీలాంబరుండును గూఢరాజ
వేషుఁడునగుచు వార్షికవేళనిసిని
బోలినత్రిశంకు సురవరుప్రోలి కనిపె ౮౧

గీ. మన్యువేగంబుచే శతమన్యు వతని
స్వర్గముననుండి క్రిందికిఁ బడఁగఁద్రోచె
నీతని నియోగశంకువు నూఁత గొంచు
నింగియందుఁద్రిశంకుండు నిలిచియుండె. ౮౨

వ. అంత నిమ్మునివరుం డమ్మనుజవరునిమిత్తంబు భువనాంతరంబు నిర్మింపఁ గడంగియు గీర్వాణగణప్రార్థన విరమించి యాప్రదేశంబునం దపోవిఘ్నం బగుటచేఁ బశ్చిమదిక్కునం బుష్కరక్షేత్రం

బునం బుష్కలంబుగఁ దపంబొనర్ప నారంభించె. అక్కాలంబున నంబరీషుండనురాజు తానొనర్చు యజ్ఞంబులోని పశువు నష్టం బగుటఁ దత్స్థానంబున నరపశువుగా ఋచీకుని మధ్యమపుత్రుం డగు శునశ్శేఫు ననేకగోవుల నిచ్చి విలిచి తెచ్చె, నాశునశ్శేఫుండు భయకంపితుండై యీకౌశికు శరణంబు వేఁడిన నీతండు హవిష్యం దాది నిజతనయులం దొక్కని వినిమయము చేసి ఋచీకపుత్రు బ్రతికింపం దలంప వారలందుల కియ్యకొనమి వసిష్ఠపుత్రులంబలె వారల శపించి శునశ్శేఫగీతగాథాద్వయసంతుష్టులైన యింద్రో పేంద్రులచే నయ్యజమానుని బశువునుం గూడఁ గృతార్థులం జేయించె. తదనంతరము మేనకాసంగతిం జిరతపోభంగంబయ్యె. దానికిఁ బశ్చాత్తప్తుండై యిమ్మునివరుండు హిమవత్పర్వతము నందు గౌశికీతీరంబునం దపంబొనర్చుచుండ జంభారిప్రేరిత యై రంభ తపోవిఘ్నంబొనర్ప యత్నింప దానిం బాషాణమగు మని శపించి యచ్చోటు విడిచి తూర్పుదిక్కున కేగి నిరస్తనిశ్వా సుండై తపంబొనర్పఁ దత్తపోగ్ని వేఁడిమి సహింపంజాలక యమ రగణసహితుండై యంభోజసంభవుండు ప్రత్యక్షంబై జితేంద్రి యత్వంబున బ్రహ్మర్షివై తివి, దీనికి వసిష్ఠుండు నంగీకరించు నని యానతిచ్చె.

గీ. శక్తిజనకుని నిర్దేశశక్తిచేత
నంత బ్రహ్మర్షిభావంబు నందె నితఁడు
ద్విజుఁ డుపనయనసంస్కార వృత్తిచేత
బ్రహ్మతేజంబుఁ దప్పక పడసినట్లు. ౮3

చ. జనకపురోహితుం డటు ప్రశంస పదింబది చేయుచుండ నా
జనపతిపుత్రులం గలసి శర్వరి యంతయుఁ బుచ్చి వేకువన్
మునిపతి భక్తితో నొసఁగెఁ బుష్పకుశాగ్రసమంచితార్ఘ్యము
న్వనరుహబంధుమూర్తికిఁ బ్రభామయమూర్తికి వేదమూర్తికిన్.

## — మిథిలాపుర ప్రవేశము. —

గ. పిదప నమ్మునివరుండు నరవరకుమారులం దోడ్కొని తదీక్షణ

కౌతుకవికచకువలయనిచయోపచీయమాన మేచకమరీచిమలిమ్లుచ పౌరనారీజనవిలోచనరోచిః కవచితరాజపథంబగుజనకరాజధానిం బ్రవేశించి రాకొమరులతో "నీ పురంబునం దారబ్ధయజ్ఞుం డగు జనకుని భాగ్యవశంబున రత్నగర్భ సీతానామధేయం బగుకన్యా రత్నంబుం గనియె.

సీ. అంబునిధి చీర కనకాద్రి యాసనంబు
సురతటిని హార మాదిమసూకరంబు
దంష్ట్రి యాటపట్టును నైన ధరణిసతికిఁ
బురిటియిల్లయ్యెను మిథిలాపురవరంబు. ౮౫

గ. ఇంతకంటె నీ పురంబు వర్ణింపనేల.

గీ. తనయ వైవాహికార్థంబు జనకనృపతి
యమరులకుఁగూడ దుష్కరం బైనయట్టి
విల్లువంచుట పణము గావించె నిపుడు
వసుధఁ గలరాజు లాశలు వదలుకొనఁగ." ౮౬

గ. అని చెప్పె.

గీ. అంత గాధినృపసుతమహర్షి వెంటఁ
జాపమును జూడ వేడ్కఁ సచాపులౌచు
నింద్రసభఁ బోలు జనకనరేంద్రు సభకు
రామలక్ష్మణు లేగిరి రమ్యగతిని. ౮౭

గ. మునిపుంగవుండును నరపుంగవునిచేఁ బూజితుండై దశరథతనయ వృత్తాంతం బంతయుఁ జెప్పె, నాజనకుండును జాపంబొక్కటి చూపి "యిది పూర్వ మింద్రాద్యమరులు మాకులంపుఁబెద్దయైన దేవ రాతునకిచ్చిరి. సీతా శుల్కార్థమై యింతఁదాఁక దీనిని రక్షించి యుంచితిని" అని చెప్ప నా విల్లెక్కుపెట్టుమని గాధినందనుండు దశరథనందనున కాజ్ఞాపించె నంత.

—* శివధనుర్భంగము. *—

చ. ఇనకుల భర్త బాహుబల మించుక చూపుడుఁ జాపవంశమం
దును బ్రథితార్కవంశమున దొడ్డగుణంబు చెలంగ శింజినిం

బనివడి లాఁగ భూతనయ మానసము న్వడి లాఁగఁగాఁబడెన్
ధనువును శత్రురాజభుజదంభము భగ్నములయ్యె నేకతన్. ౮౮

శా. రామాకర్షణభగ్న కార్ముకమహారావంబు రంజిల్లె దృ
ప్తామిత్రాధిపకీర్తి హంసతతికి న్నంభోదనాదంబుగా
భూమి స్వీరరమాగమంబుతఱి నో పుణ్యాహఘోషంబుగా
క్ష్మామాన్యాత్మజ మానసోత్సవమున న్మాంగల్యతూర్యంబుగాన్.

ఉ. చాప విభంగసంజనితశబ్దము దిగ్గజ ఘీంకృతిన్ దశా
శాపరిపాలకావళికి స్వాగత మొప్పఁగ నిచ్చుచున్ జగ
ద్వ్యాపన కౌతుకోచ్చలిత దాశరథీద్ధయశోంగనా ప్రయా
ణోపనతోరుదుందుభి రవోద్ధతిఁ జూపెను మింటియందునన్. ౯౦

వ. పదంపడి.

—* సీతాకల్యాణము *—

మ. సురసంగీతపుగోష్ఠికిం దిలకమై శోభిల్లు నెవ్వాని భా
స్వరసత్కీర్తి యెవండు కైటభరిపున్ సత్పుత్రుఁగాఁ గాంచెనో
ధర యే పార్థివుపాలనంబు మహిమం దా నొప్పె రాజన్వతీ
వరనామంబున నెవ్వఁడింద్రుభయముం బాపంగఁ జాలెన్సదా.

వ. అట్టి దశరథుండు సీతావివాహకృత నిశ్చయుండైన జనకుం డంపిన దూతలచే నాహూతుండై వసిష్ఠానుమతి నొంది మిథిలకు విచ్చేసె. జనకుండును బూర్వము సుధన్వాను జయించి తత్పట్టనంబగు సాంకాశ్యంబున స్థాపించియుంచిన తనతమ్ముం గుశధ్వజు రప్పించి యిరువురుం గూడి సపురోహితుండగు దశరథుం బూజించిరి. కోసలపతియుఁ బుత్రులకు గోదానమంగళంబు నడిపించెనంత.

క. జనకుని దేశము చేకొని
జనకునిచేఁ గొనె రఘుపతి జానకి నామ్నా
యనిదేశము చేతను నా
యనలుఁడు యజమానుచేత నర్చంబోలెన్. ౯౧

చ. అనిమిష చాపమందు గుణ మల్లన నించుక పూన్చి గాధినం
దనువచనంబు నూని రఘునాథుఁడు చేకొనె సీత నంతనా
తనియనుజుండు లక్ష్మణుఁడు తామరసాక్షిని నూర్మిళం గొనెఁ
జనకుని చిత్తమందు నిజసద్గుణరాజిని నిల్పి, చిత్రమా! ౯౩

వ. పిదపఁ గుశధ్వజుండు మాండవీశ్రుతకీర్తుల భరతశత్రుఘ్నులకుం బరిణయం బొనర్చె. ఇట్లు కృతవివాహులైన కొడుకులతోఁ గూడుకొని దశరథుండు నిజరాజధానికిఁ బోవుచు మార్గమధ్యంబున సంవర్తసమయ సముజ్జృంభితహుతవహదుస్సహరోషభీషణుండును దుర్వార పరాక్రమక్షత్రగర్వ పరిహారక పరశుధారాపరికల్పితరుధిరధారాసుస్థిత పితృతర్పణుండును దర్పవదగ్రేసరుండును నుదగ్రప్రతాపుండును దపస్సముచితవేషుండయ్యు వాసనావశంబున ననల్పయుద్ధశ్రద్ధుండునై రామభద్రు వెదకుచు వచ్చునట్టి భార్గవమునిం జూచి భయాకులచిత్తుండై సపర్యాపూర్వకంబుగా "నార్యశీలా! కుశలమా!" యని ప్రశ్నించె.

చ. క్షితిపతివాక్యము ల్చెవులఁ జేర్పక యుద్ధతి భార్గవుండు స
న్నతుఁడగు రామునితో ననెఁ "బినాకము ప్రావిలు దానిఁ ద్రుంచియూ
తతనుతి నొంది నాపరశుధార నెఱుంగని దోర్మదంబు వి
శ్రుతమగు నాశరాసనమునఁ జూపినఁ జూడఁగ వేడ్క య్యెడుఁ." ౯౪

గీ. అనిన నాతని చాపంబు నల్లనఁ గొని
గుణము సంధించి బాణంబుఁ గూర్చి యతని
సంయమ ధనత మది నిల్పి చంపు టుడిగి
రణమునుండి తా విరమించె రాఘవుండు. ౯౫

గీ. అనఘభృగువంశ సంజాతులైన యట్టి
చాపదండంబు జమదగ్నిసంభవుండు
రాఘవార్పితగుణు లౌచుఁ బ్రహ్వభావ
మొంది యుద్ధతిని విడిచి యుండె నపుడు. ౯౬

గీ. చాపమును భార్గవుండును సద్గుణంబు
నొక్కవేళ యందే పొంది యుండిరైన

వక్రతను బూనె సరళత వదలి ధనువు
వక్రతను వీడె సరళుఁడై భార్గవుండు. ౯౭

వ. తత్క్షణంబ రాఘవుం డమోఘంబైన బాణంబుం బ్రయోగించి భార్గవు సద్గతికి భంగం బొనర్చె, నది యుక్తంబకాదె.

చ. భృగుపతి రాఘవేంద్రుగతి కించుక విఘ్న మొనర్చి స్వీయమా
సుగతికిఁ జేటుఁ దెచ్చుకొనెఁ జూడఁగ నయ్యది యుక్తమే గదా
జగతి మహానుభావులకు నంకటపా టొదవింప దానికిం
దగిన ఫలంబు చొప్పడక తప్పునె యెంతటివారికేనియుఁ ? ౯౮

—*అయోధ్యాపుర ప్రవేశము*—

వ. సంక్రాంతభార్గవశక్తిసంపన్నుండును పన్నగరాజభోగభుజాభిరాముండు నగురాము గాఢాలింగనం బొనర్చి శిరము మూర్కొని దశరథుండు సరయూపరిఖయగు నయోధ్యం జేరి సదార రాజపుత్రాలోకన కుతూహల పౌరపురంధ్రీలోక నీరంధ్రకటాక్ష పింఛాతపత్రాయమాణ శ్వేతాతపత్రుండై నిజమందిరంబుం బ్రవేశించె.

చ. ఘనమగు లజ్జచేత సుమకాండ వికార విచేష్ట లేవియుం
గనఁబఱుపంగ నోడునిజకాంతలఁగూడి తమి న్రమించు రా
ట్తనయుల నల్వురం బొదివి తత్పరత న్భజియించె నష్ట యౌ
వనదశచిహ్నమై పరఁగు ప్రప్రథమంపు రసం బెసంగుచున్. ౯౯

గీ॥ పృథివి నిగమాంత సంవేద్యవిద్య నొందు
దర్భ పత్రాగ్రధీయుతతద్జ్ఞపగిది
నిమికులాదీశుతనయను నెమ్మిఁగూడి
రాముఁ డుత్తమమైనట్టి ప్రమద మొందె. ౧౦౦

ఇది శ్రీమత్కౌశికగోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకరసుధాకర రామయ నామధేయ
ప్రణీతాంధ్ర చంపూరామాయణంబు
నందు బాలకాండము సంపూర్ణము.

---

# అయోధ్యాకాండము

క. ధరణీపాలన పరుఁడౌ
ధరణీపతి దశరథుండు తద్దయు సుఖియై
వరలి భరత శత్రుఘ్నుల
నిరువురఁ గేకయనరపతి యింటికి నంపెన్. ౧

—*దశరథుఁడు రామునకుఁ బట్టాభిషేకము చేయఁ దలంచుట*—

గీ. సకలలోకేశుఁడౌ రామచంద్ర విభుని
గోసలాధిపుఁ గావింపఁ గోరెఁ దండ్రి
పృథివి మోయంగఁజాలిన వేల్పుగొండ
నింటినిత్రాడుగా నిల్ప నెంచినట్లు. ౨

వ. అనల్పం బగునీసంకల్పంబు పొడము మంత్రివర్గంబుతోఁగూడి యాలోచించి వృద్ధశ్రవఃపురోధస్సము లగు పౌరవృద్ధుల రావించి వారలతో రాజి ట్లనియె.

"మాపూర్వులు సత్సంకల్పులు, సన్మార్గప్రవర్తకులు, భూతదయావిష్టమానసులు, మానధనులు, కీర్తికాములు, జనోపతాపనివారకులు నయి పరమానందం బనుభవించి దేవభూతులయిరను నది మీర లెఱింగిన విషయంబేకదా. వారిమార్గంబునే యనుసరించి యింతకాలంబు నేఁ బ్రజాపరిపాలన మొనర్చితి ననుటకుఁ బ్రత్యక్షానుభవజ్ఞులైన మీరే ప్రమాణంబు. శాస్త్రతుల్యంబు లగు భవద్వాక్యంబుల నతిక్రమింప నెవ్వరును సాహసింపరు, కాన మిమ్ము నే నొక్కటి ప్రార్థించెద.

చ. సురనరగీత పాత్రమయి శోభిలు మన్నిశితాసిధారలన్
ధరణిని నాకమందుఁ బ్రథితంబగు మద్భుజ విక్రమంబుల
న్సరకును జేయకుండ జర నాతను వియ్యదె యాక్రమించె వి
స్ఫురదరవిందషండమును బూర్ణసుధాంశుకరాళి పోలికన్. ౩

వ. కావున సమస్త క్షత్రవర్గ గర్వపాటన పటిష్ఠధార పరశ్వధ భరణ భీషణవేష భార్గవ భంగకరణచణాపరిచ్ఛిన్నతర శౌర్యశాలియు, సౌజన్యభాజనంబును జనానురాగ నిలయుండును నిర్మత్సరుండును వత్సలుండు నగు నీవత్సయందుఁ జిరకాలము నేధరించియున్న యీ విశ్వవిశ్వంభరాభారంబు భవదనుమతిపురస్సరంబుగా న్యాసంబు గావించి విశ్రాంతిసుఖం బనుభవింప నభిలషించు చున్నవాఁడ"

అని దశరథుండు పలుకు వర్షాకాల మేఘ గర్జనంబుల వినుటచే నిరతిశయానందభరితంబులగు నెమళుల కేకారావంబునుం బోలు జనానందసంజనితకలకలరవంబుచే దిఙ్ముఖంబులు ప్రతిధ్వను లీనె. మఱియు

గీ. భావిశుభవేళ రాముని ప్రభను జూడ
జనులు కనులఁ జక్కఁ గడిగికొని రనంగ
నూరె నానంద బాష్పముల్ పౌరచక్షు
లందుఁ దమ్మిపూల మరంద బిందులట్లు. ౮

వ. నరపతియు భావి మహోత్సవ సందర్శనార్థులై గుమిగూడు జనుల సమ్మర్దంబువలనఁ గలుగంబోవు ధూళి శరీరములం బడకుండ రోమాంచ మనుకంచుకంబుల ధరించిన పౌరజనుల మానాతీతానందముం గాంచుటఁ ద్విగుణీకృతంబగు నాత్మానందంబు వ్యక్తంబు గాకుండ లోన నిముడ్చికొని సుమంత్రముఖ్య మంత్రివర్గంబుతో నిట్లనియె.

గీ. అడవి కేగుట మాని యీపుడమిపాల
నమ్ము జతనతోఁ జేసెడు మమ్ము విడిచి
బాలుఁ డైనట్టి మారామభద్రుమీఁదఁ
బ్రజలయనురాగ మేరీతి బ్రాలెనొక్కొ? ౯

వ. అన విని మంత్రు లానియమితనిజమనోరథుం డగు దశరథునకు సవినయంబుగ నిట్లని విన్నవించిరి.

గీ. మీర లుండఁగ జనతతి మీతనూజు
వలను బని యేమి యింత మోహంబు [illegible]

దప్పిగొన్న చకోరంబు తమ్మిపైరిఁ
జేరఁగాక సుధాంబుధిఁ జేరనొక్కొ? ౬

వ. అంతఁ దత్త్వవిద్వరిష్ఠుఁడగు వసిష్ఠునాజ్ఞచే మంత్రులును బౌరవర్గంబు నభిషేకోపకరణాహరణంబునకై చత్వరంబున మూఁగికొనియుండి రప్పుడు.

గీ. రాజు వినయాభిరాముని రాముఁ బిలిచి
తిష్యయుక్త మౌ రేపటి దివసమందు
యుష్మదుత్తమాంగంబునం దుంతు మకుట
మనుచు నత్యంతహర్షంబు దనరఁ బలికె. ౭

వ. పిమ్మట దశరథమనోరథంబుఁ గౌసల్యకు నివేదించి నిజభవనంబునకేగుచున్న రామునకు సంజాత కౌతుకుండగు వసిష్ఠుండు కౌతుకమంగళం బొనర్చె నప్పుడు.

గీ. తోరమైనట్టి మంగళతూర్యనాద
మఖిల దిగ్గజకర్ణంబులందుఁ దాఁకఁ
బౌరజనుల ప్రమోదం బపారమగుచు
వెలసె నెల్లెడ వర్ణింప నలవికాక. ౮

వ. ఆసమయంబున.

—* కైకేయి రెండువరములు వేఁడుట *—

గీ. సురభికాసారజలముఁ గాసరి కలంచు
కరణిఁ గైకసుస్వాంతంబుఁ గలఁతపఱిచి
కుటిలమతి మంథర దనుజకులవినాశ
కార్యమున కయ్యెఁ దా నాది కారణంబు. ౯

గీ. చల్లనౌ మేఘమండలిఁ జటులవాత
ఘట్టనంబున దంభోళి పుట్టునట్లు
భరతమాతృహృదయమందుఁ బాపబుద్ధి
పాడుమంథర దుర్బోధవలనఁ గలిగె. ౧౦

వ. ఇట్లు మంథరాభిధానపిశాచికావేశ పరవశయగు కైకేయి పూర్వము దండకారణ్యమందు వైజయంతపుర వాస్తవ్య శంబరాసుర

సంగరంబునందు దైన్యంబు వాపుటచే నాథుండు తనకు రెండువరం బు లొసంగుట జ్ఞప్తికిఁ దెచ్చి భరతునకుఁ బట్టాభిషేకం బొనర్చుట యొక్క వరంబుగను రామువనవాసంబున కంపుట రెండవవరంబుగ ను నిట్లావరంబుల రెంటిని జెల్లింపుమని వేఁడెను.

గీ. తద్వరయుగంబు చిరకాలతప్తమైన
నారసంబులగతి శ్రవణములఁ గాఁడి
సత్యహానికి జంకెడు ధర్మాత్మ లేమ
చిత్తమందునఁ బుటపాకవృత్తి నొప్పె. ౧౧

గీ. తనయవిరహంబువార్తచేఁ దప్తమైన
పంక్తిరథుచిత్తము స్వేడ పాటెఁ దెలివి
చండదావాగ్ని దరికొని మండుచుండఁ
బొదను విడనాడి హరిణంబు పోవునట్లు. ౧౨

క. కొంతవడికిఁబడమిత్తేఁడెట్టులో తెలివినొంది కైకేయితోనిట్లనియె.

ఉ. కౌతుక మూడ్చి రాముఁ డిదె కానకు నేగెడుఁగాక పౌరులుం
గౌతుకభంగ మెట్లొ కడఁక న్భరియింతురుగాక నేనునుం
బాతకభీతిఁ బుత్రు నెడఁబాటు సహింతును గాక నీ వహో
ధర్మాతలమందు నెన్నటికి మాయని దుర్యశ మెట్లుమోచెదో. ౧౩

గీ. రాము గుణధాము నయనాభిరాము వీడి
నిముస మైన నాప్రాణంబు నిలువ దకట
వజ్రహృదయ నీయుపమము వైభవంబు
నాకు నిపు డయ్యె నుపయమనాయకంబు. ౧౪

క. ఆమాటల మన్నింపక నిజమనోరథైక పరిపూర్ణకృతాదర యగు కైకేయి సాహసంబుగా రాజుతో నిట్లనియె.

గీ. పుత్త్రమోహంబు చేతను భూరిసత్య
హాని కంగీకరించి నీ వాగ్ఘతంబు
నిష్ఫలంబు చేసెద వేని నిశ్చయముగ
నాగ్రతంబున కే నిదే యంజలిడుదు. ౧౫

గీ. సత్యవంతులలోపలఁ జాలదొడ్డ

వాఁడు నానొప్పుశిబి తొల్లిపారువంబు
సిసువు రక్షింపఁ దనమేని నసిని గోసి
శ్యేనమున కిచ్చె ననుమాట చెవినిఁబడదె. ౧౬
గీ. ప్రాజ్ఞుఁ డత్యంత మహిమాను భావయుతుఁడు
నగునలర్క భూపతి తన్ను నాశ్రయించి
నట్టి బ్రాహ్మణునకుఁ దన యక్షియుగ్మ
మొసఁగి సత్యసంధుఁడనంగ నొప్పెఁగాదె. ౧౭
గీ. దనుజ సమర వేళా జాతదైన్య ముడుప
నిచ్చిన వరముల జరుపవేని సత్య
సంధు లౌనృపు లీమాట జలలిపి యని
సర్వకాలంబు నెగతాళి సలుపరొక్కొ. ౧౮
గీ. పలికిన పలుకు నిప్పుడు నిలుపుకొమ్ము
జరుగుచున్న యత్నం బుపసంహరింపు
కానిచోఁ జచ్చెదను విష మేను మ్రింగి
సవతి కౌసల్య విభవంబు సైఁపఁజాల. ౧౯
గ. ఇట్లాడుచున్న కైకేయితో నాథుండు మరల నిట్లనియె. "ఓసి! నిర్దయురాల! లోకమర్యాద నైనఁ బాటింపక ప్రేలుచున్నదానవు.
గీ. రాముఁడు జనకవంతులరాశిలోను
శీలవతులలో నీవును జేర రనయ
తనయసౌఖ్యంబు నా కిఁకఁ దక్కదెపుడు
భరతుఁడు నివాపజల మీయవలదు నాకు. ౨౦
గీ. నారచీరలు బట్టలై మీఱుఁగాక
చెట్టునీడయె భవనమై చెల్లుఁగాక
వత్స కకట నీమదికంటె వాఁడియైన
పట్టె ఱానేల శయనమై పరఁగు టెట్లు?" ౨౧
గీ. భర్త యిటులెంత వేఁడినఁ బడతి మనసు
కరఁగ దయ్యెను మంథరాక్రాంత మగుచు
ఘనలతాకాంత శశికాంత ఘటితతలము

నెఱ సుధాసూతికిరణాళిఁ గరఁగనట్లు. ౨౨

—*కైకేయీ శ్రీరామ సంవాదము*—

క. క్షణమాత్రంబయిన రామముఖావలోకన సుఖానుభవ మందఁగోరి కుమారుని దెమ్మని దశరథుండు సుమంత్రు నంపుటయు నతం డట్లొనర్ప రాముండు తండ్రియొద్దకు వచ్చియాతనిముఖవికాసంబు యథాభూతంబుగాఁగాక విపరీతంబుగా నుంట పరికించి తత్తఱం బంది యాతం డట్టు లుండుటకుం గారణం బే మని కైకేయి నడుగ నాపాపాత్మురాలు-"వత్స! తొల్లి నీతండ్రి నాకు రెండువరంబు లిచ్చెదనని ప్రతిజ్ఞచేసి యిప్పుడు మునివృత్తితో జరించుటకై నిన్నడవికిఁ బంపియు, భరతునిచే భూపరిపాలనంబు చేయించియు నావరంబుల నెఱవేర్పుమని నేఁగోర నట్లొనర్పంజాలక పుత్రవాత్సల్యం బొకవంకకు నసత్యభయం బొకవంకకు హృదయంబును లాగుచుండ నిప్పు డగాధశోకసాగర నిమగ్నుండై యున్నవాఁ" డని చెప్పుటయు రాముండు సంతోషితస్వాంతుండై తల్లి కంజలి యొనర్చి యిట్లనియె.

చ. భరతుఁడు భూభరంబునకుఁ బావనమౌ వనవృత్తి కేనును
న్వెఱతుమె తండ్రి కేల విలపింపగఁ దా నగరాన్వవాయుఁడై
పరఁగుచు, జాహ్నవీజల నివాపము కంటెను నల్పమైన గో
వరయుగభార మిర్వురముఁ బాపకయున్న నితండు పుత్రియే. ౨౩

చ. అడవిని బొట్టపోసికొని హాయిగనుండఁగ నన్నుఁ బంపి యీ
కడిఁదివసుంధరాభరణ కార్యభరమ్మును దమ్ము నెత్తిపై
నిడితివి. మేలుగీళ్ల మది నించుక యోఁచిసి చూడ నీకు నా
యెడఁ గడుఁ బక్షపాతమని యెంతయుఁ దెల్లముగాదె తల్లిరో. ౨౪

క. మఱియొక్కమాట.

గీ. వత్సపట్టాభిషేకోత్సవంబువార్త
తండ్రి యిప్పుడు నాతోడఁ దానె చెప్పి
మన్నమస్కారసంజ్ఞాతిమహితపూర్ణ
పాత్ర పాత్రంబుగా నేల వలవఁడొక్కొ? ౨౫

వ. ఈపలుకులు చెవిసోఁకినంతన దశరథుండు తెలివిదప్పి కులిశహతంబగు శైలంబు లీలఁగార్చిచ్చు దరికొన్న వనస్పతివడువున దివస్పతిపదభ్రష్టుండైన నహుషుని వహినినేలంగూలె,నంతఁ గేకయరాజపుత్రియు"వేఱుతలంపులు మాని తండ్రియాజ్ఞను వెంటనే నెఱవేర్పవలయు" నని రామున కాజ్ఞాపింప,

క. జననీనిదేశ మప్పుడు
తనశిరమున మాలపోలెఁ దాలిచి రాముం
డనఘాత్ముండు త్రిలోకా
వన మొనరింపంగఁ దలఁచి వనమున కేగెన్. ౨౬

—*కౌసల్యాలక్ష్మణులతో రాముని సంవాదము*—

వ. పోవుచు రాముండు తల్లికౌసల్యగృహంబున కేగి యామెకు మ్రొక్కి కైకేయీ నిర్బంధమువలనఁ బట్టాభిషేకమాఁగిపోయినదనియుఁ దా నడవికిఁ బోవుచున్నాఁడ ననియుఁజెప్ప నాపలుకులు ములుకులై చెవుల నాట నాబోఁటి నేలపైఁ బడి యిట్లని విలపించె.

గీ. అరిదరాంబుజ చారురేఖాంకితంబు
నిఖిలలోక శంకరమునౌ నీకరమునఁ
గందమూలము లాకాననమందుఁ ద్రవ్వ
మనుచుఁగట్టెఁ బో దోరంబు మునివిభుండు. ౨౭

వ. అప్పు డత్యంతకోపావిష్టుండై సౌమిత్రి యాఖండలసమానుండగు నన్నను జేరి"ఆర్యా, వార్ధకముచే బుద్ధిక్షీణింప లోకగర్హణార్హయగు కైకేయి మాటలకు లొంగి కృత్యాకృత్యనిర్ణయంబు చేయంజాలని తండ్రిమాటలంబట్టి నీవడవికిఁబోనిశ్చయించుట యుచితంబుగాదు. నీవడుగకుండఁగనే నాయనగారునీకురాజ్యం బిచ్చెద నని దానే చెప్పెంగదా! ధర్మమార్గం బతిక్రమించియైనను వర్ణాశ్రమరక్షణం బొనర్చుట క్షత్రధర్మము. దానివలన నిశ్శ్రేయసంబును దప్పక లభించును. పౌరుషంబుచే దైవబలంబు నిరాకరించి ధీరుండు పురుషార్థంబుల సాధించుకొనును. కావున

చ. గౌనయములాఁగ నాకరము కొంచెము పాటలమై చెలంగెడు
న్వనిని జరింప నీచరణపద్మము లెత్తుపడంగ నేల, నా
ధనువ యొకింత నమ్రమగుఁ దన్విదురుక్తి వినమ్రుఁడైన యీ
జనకునిమాట కీవమితసత్త్వుఁడ నమ్రతనొంద నేటికిఁ. ౨౮

గ. అని నొక్కి వక్కాణించు తమ్మునితో రాముండు "అబ్బాయి అన్నికర్మములందును సూర్యవంశరాజులకుఁ బితృనిదేశమే యాచార్యుండు. పూర్వకాలమందుఁ గండుపరశురామప్రూరు ప్రభృతులు పితాజ్ఞాగౌరవంబుచే గోహత్య, మాతృవధ, తారుణ్యవినిమయంబు మొదలగు కార్యములు నిశ్శంకంబుగా నొనర్చి సదాచార సంపన్నులలో నుత్తములుగా నిప్పటికిని గణింపంబడుచున్నవారు. కావుననాయనగారి యాజ్ఞాప్రకారము తప్పక నే వనమున కేగెద" నని చెప్పి యాతని నొప్పించెను. అంతఁ బుత్రవాత్సల్యాతిశయంబుచేఁ గౌసల్య తానును వనమునకు వచ్చెద నని పలుక రాఘవుండామెకుఁ బ్రణామం బొనర్చి.

గీ. కానకే నేగినట్టి దుఃఖంబుచేతఁ
గైక యాడెడు నట్టి యాకటకు నుడులఁ
దగ్గయును డస్సిపోయెడు తండ్రి మేను
తల్లిరో నీ వుపేక్షింపఁ దగదు చుమ్ము. ౨౯

గ. అని ప్రార్థింప నాయమ యాయుద్యమం బుజ్జగించి సకలదేవతాసంకీర్తన పురస్సరంబుగాఁ గొడుకు నాశీర్వదించె. రాముండంబకు ప్రమొక్కి యచ్చటినుండి బయలుదేఱి పట్టాభిషేకోత్సవోచిత వేషభూషిత యైన సీతాగృహంబున కేగి,

గీ. ముకుటబంధంబువార్తచే ముదిత యైన
సతికి వనవాసకథచేత వెతనొనర్చె
ఘనరవంబును విని యుబ్బు వనమయూరిఁ
జ్యారవమ్ముచేఁ గలఁచు నిషాదు పగిది. ౩౦

గ. సీత తనతోఁగూడ వనంబునకు వచ్చెద నని చెప్ప,

గీ. జనకనందిని లలితంబు సహజ పేశ

లంబు నైనట్టి నీశరీరంబు నకట
కూరమృగ కీర్ణమైనట్టి ఘోరవిపిన
మందు నలయింపఁ దలఁ తేల యిందువదన. ౩౧

—* శ్రీరాముఁడడవికిఁ బ్రయాణమగుట *—

వ. ఇత్యాది ప్రతిహతవాక్యంబు లెన్ని చెప్పినను జనకుపట్టి తనపట్టు విడువకుండుటయు, సౌమిత్రికూడఁ దోడవచ్చు నుద్యమంబు మానకుండుటయు వారి యిరువుర రాక కంగీకరించి రాఘవుం డశేష భూషణ జాతంబును మేనమామ తన కిచ్చిన శత్రుంజయంబను మదహస్తి సహితంబుగా వేయియేనుంగులను వసిష్ఠపుత్రుండగు సుయజ్ఞునకును మహార్ఘంబులయినరత్నంబు లగస్త్యకౌశికులకు సమర్పించి తొల్లి జనకసభలో వరుణుండు తనకుఁ బ్రసాదించినదనుజ వీర్యభంజకంబు లగుధనువులను నిరపాయత్రాణకర్మము లగువర్మములను, అక్షయసాయకంబులగు నిషంగంబులను నిర్వర్తిత వీర పాణంబులగు కృపాణంబులను దమ్ముని చేతికిచ్చి పట్టుకొని తనవెంట రమ్మని యాజ్ఞాపించె. పిదప జానకి తనయాభరణంబుల నన్నింటిని సుయజ్ఞు భార్యకును లక్ష్మణుండు తనయావద్ధనంబును గౌసల్యా పురోహితునకు నిచ్చివైచిరి. అంతఁ ద్రిజటుండను నిఱుపేద బ్రాహ్మణుండు సకుటుంబంబుగా వచ్చి ధనము యాచింప నాతండు చేయార విసరివైచిన కఱ్ఱపడినచోటువఱకు వ్యాపించియున్నయావులమంద యాతనికిచ్చి మిగిలియున్న వివిధవిత్తంబులం గపింజలాది బ్రాహ్మణబృందంబునకు రాముండు సమర్పించె. పిదప నాసీతారామలక్ష్మణులు శుద్ధాంతంబులు వీడి వనవాసోచితవేషధారులయి నిష్పరిజనంబుగాఁ బోవుచుండ వారిం జూచిన నిశ్వాసఝంఝానిలచలదధరకిసలయ పౌరనారీజనంబుల హృదయంబులు శోకపావకంబుచే మండుచుండ బాష్పసలిలాసారంబు వారితనువులం బడియె, నప్పుడు

గీ. సురలు సైతము నెన్నఁడుఁ జూడనట్టి
సుందరాంగిని మానవు లూచెడ నేల

యనుచు బాష్పపూరంబుచే జనుల కనుల
గట్టిగాఁ గప్పె నప్పుడు కంజభవుఁడు. 32

గ. అంత.

గీ. వలదు వల దన్న మానక వచ్చు సీత
వదలకున్నాఁడు క్షణమైన వత్స నన్ను
ననుచు జనకునితోఁ జెప్పి యడవి కరుగ
రాజునింటికి వెండియు రాముఁ డేగె. 33

గ. ఇదె రాముండు భవద్దర్శనార్థంబై వచ్చియున్నవాఁ డని సుమంత్రుండువిన్నవింపరాజు భూతావిష్టునిం బోలె భూమిపైఁబడివిలపించుచుఁ దానును వనంబున కేగ నభిలషించె. సుమంత్రుండు కైకేయి నుద్దేశించి, దేవి "రామాభిషేక సమున్మిషితాహ్లాదాంకురావగ్రహంబగు నాగ్రహంబు వీడుము. తొల్లి వరప్రభావంబున సకల ప్రాణిభాషల నెఱింగిన నీతండ్రి పర్యంకసమీపమందున్న పిపీలికంబుల మాటలు విని నవ్వ నీతల్లి యట్లు నవ్వుటకుం గారణం బేమని యడుగుటయుఁ గారణంబు చెప్పినచో నాకు మరణంబు తప్పక వచ్చు నని యాతండు నొక్కి చెప్పిన నది నరకుసేయక బహువిధంబుల నిర్బంధించి యాతనిచే నవమానితయయ్యె. నీ వాదారిని బోకు" మని నొక్కి వక్కాణించె.

గీ. కైక యసమంజనిర్వాసకథను జెప్పి
భర్త నెంతయు నిర్బంధపఱిచె నపుడు
జనుల నేటిలోఁ బడఁద్రోసి చంప నట్లు
సగరుఁ డొనరించె నని యొక్కసచివుఁ డనియె. 34

గ. అంత దశరథుండు సపరిచ్ఛదుండ వైపొమ్మని చెప్పినను రాముండు జోడునారచీరలు, గుద్దలియుఁదట్టయుమాత్రము చాలు నని యవి పుచ్చుకొనియె.

గీ. దివ్యలావణ్య సంపత్తిఁ దేజరిల్లి
పరమసౌఖ్యార్హులై నట్టి వారి ముగుర
కాక్షణంబునందున వల్కలాంబరములఁ

గరుణ విడనాడి కఠినయై కైక యిచ్చె. ౩౫

గీ. మంగళార్ద్రదుకూలము ల్మాని యపుడు
చన్నుఁగవమీఁదఁ బడి చిందు జనకతనయ
బాష్పవితతిచే మెత్తనౌ వల్కలములఁ
గట్టె రఘుకులనాథుఁడు కైకయాజ్ఞ. ౩౬

వ. ఇట్టులయ్యును నిర్వికారవదనలక్ష్మీకుండై యున్న యిక్ష్వాకుకులాధ్యక్షుం గనుటచే నాశ్చర్యమగ్నులును శోకశంకువిద్ధహృదయులు నగు పౌరజనుల యాననంబుల మాత్రము వికారంబు కన్పట్టె.

గీ. దాశరథి యిట్లు వల్కలధారి యగుడుఁ
గనులు మూసె వసిష్ఠుండు కనఁగఁజాల
కదియుఁ గాకుత్స్థు యాథార్థ్య మరయఁ గోరు
నామహర్షికి సాధనంబై చెలంగె. ౩౭

గీ. కలిత పీతాంబ రాభావకలనచే వి
కార మేమి రామునియందుఁ గానరామిఁ
బ్రత్యగాత్మజ్ఞసన్మునివర్గమందు
బ్రథముఁ డమ్ముని మిగులఁ దా వగచు టడిగె. ౩౮

వ. అమ్మునివర్యుండు జానకి నారచీరలు గట్టుట మాన్పె. అంతఁ బ్రయాణోన్ముఖియై సీత తనకు మ్రొక్క సముత్పన్నపుత్రవాత్సల్యయగు కౌసల్య యామెను గౌఁగిలించుకొని గద్గదస్వరంబుతో ని ట్లనియె.

గీ. "మండు వేసవి కాలమం దెండలోన
వెచ్చవెచ్చనౌ కాంతారవీథులందు
నరుగు నినుఁ జూచి వనదేవతాళి వనరుఁ
దప్పక నిమేషభావంబ తమకు లేమి." ౩౯

వ. రాఘవుం డంత సీతాలక్ష్మణయుతుండై తండ్రికిని దల్లులకును బ్రదక్షిణపూర్వకంబుగాఁ బ్రణమిల్లి వెంట రాఁబోవు ప్రతీహారజనంబును నివారించి రాజభవనంబు వెడలి చనియె.

దశరథునాజ్ఞచే సుమంత్రుం డరదంబు సిద్ధంబుచేసి తీసికొని వచ్చుటయు.

సీ. గ్రహావిభునికంటె నానీలరథ్యరథము
ప్రథమమునఁ దానె యెక్కెడు ప్రభనుబోలి
దాశరథికంటెఁ దానె యారాత్రిరథంబు
ముందుగా నెక్కె జానకి ముదముతోడ. ౪౦

గ. పిదప దాశరథులు నారథం బధిష్ఠించిరి.

గీ. పుడమిపుట్టు వయోధ్యను విడిచిపెట్టి
యడవి కేగఁగాఁ దమకించినట్టి యపుడ
లంక విడనాడి రాక్షసరాజలక్ష్మి
కదలిపోవ నుంకించె నుత్కంఠతోడ. ౪౧

గీ. పూని యాబాలవృద్ధంబుగా నయోధ్య
రాము వెన్కొన నేను మాత్రంబు మాన
నేల యనుచు వివిధమాచు నేల యపుడు
ధూళిరూపంబు గనుచు ముందుగనె చనియె ౪౨

గీ. విధివశంబున నృపసుఖ విముఖుఁడైన
యధిపు వెనువెంటఁ దనకూఁతు రరుగుచుండఁ
గంటఁ దడిపెట్ట శుభదంబు కా దటంచుఁ
బ్రజలకన్నీరుధూళిచేఁ బాపె ధరణి. ౪౩

గీ. పౌరులందఱు రాము వెంబడిఁ జనంగ
భవనము ల్చత్వరంబులు పాడుపడిన
సూర్యకుల రాజధాని తా శూన్యమగుచుఁ
బాము విడిచిన కుబుసంబు పగిది దోప్పె. ౪౪

గ. దశరథుండు నింట నుండం జాలక యంతఃపురజనంబుతోఁ గూ
పట్టణంబు వెలుపలకుం బోయి రాము నదియుపనిగాఁ జూచుచ
నంత నాసుమంత్రాధిష్ఠితస్యందనంబు దృష్టిపథంబు నతిక్రమింప
స్యందమానబాష్ప ప్రవాహుండును మోహావిష్టుండునై మహి
[illegible] గొంతవడికి మూర్ఛదేఱి కొ

ల్యామందిరంబునకుం జనియె.

ఇట రాముండు నేను నే నని మూఁగికొన్న జనసమూహం బుం దప్పించుకొని పోవలసివచ్చుటం జేసి రథము మెల్లఁగా నడిపిం చుకొని మోహాతమసముచే సకలజనవివేకకోకనదంబుల ముకుళీం పం జేయుచు నెట్టకేలకుఁ దమసాతటముం జేరె. సహస్రదీధితియు నప్పుడే చరమగిరి తటంబు చేరినవాఁడయ్యె.

గీ. రాముపాదము ల్వీడలేక తాము నడవి
కరుగు చుండెడి జనులకు నల్లతమస
తటమునందలి తరుమూలతలములపుడు
పర్ణశయనాళితో నిండ్లవగిది నొప్పె. ౭౫

వ. రాముండు నిశీథినీసమయంబున సుమంత్రునితో నాలోచించి కూడవచ్చిన పౌరజనంబునకుం దెలియకుండ నతివిసతానందనంబగు స్యందనం బెక్కి తొల్లి మను విక్ష్వాకున కొసంగినట్టి వేదశ్రుతి గోమతీనిష్యందికానామనదీత్రయాలంకృతంబగు దేశంబు నతిక్రమించి దట్టమగు నడవుల నట్టనడుముగా గగనగంగాలింగిత శృంగ శృంగిబేరపురాలంకారం బై గంగయొడ్డున నున్న యింగుదీపాదపంబుం జేరె నచ్చట.

—*గుహుఁడు శ్రీరాముని దర్శించుట*—

మ. జనిసాహస్రకృతోరు పుణ్యకలనా సంద్రష్టవ్యుఁడౌ రామునిం
గనుటన్ హార్దము తల్లియాజ్ఞ వని కేగం బూనినాఁ డంచుఁ దా
వినుటన్ శోకము నేక మై మనములోఁ బెల్లుబ్బ శీతోష్ణమై
కనునీరల్లనిషాదనాథు మొగముం గ్రమ్మెన్ నితాంతంబుగాన్. ౭౬

వ. ప్రియసుహృదుండగు నాగుహుండు దాశరథిం జేరియంజలి యొనర్చి "దేవా! దేవర పితృనియోగప్రవణాంతఃకరణు లని యెఱింగి నను జానపదరీతి నెఱుంగని నాభారతి పలుకం బ్రేరేపించుచున్నయది. అనివార్య వీర్యోద్భట భటదుర్గవర్గయుక్తంబు ననపాయభోగ్యవస్తుజాతసమృద్ధంబు మంథరాహృదయశల్యంబు నగునా రాజ్యంబు పరిగ్రహించి నన్ను భవత్పరిజనయోగ్యభాగ్యభాజనునిగా

నొనర్చి విస్మయనీయానుభావమునిబృందం బగు నీదేశంబున మందాకినీసందర్శనంబుచే జననీవియోగదుఃఖంబు నించుక యుపశ యించుచుఁ బితృనిదేశంబును దాఁటకయే పదునాలుగు సంవత్సరంబులు గడపవలయు నని నామనవి" అని విన్నవించె.

గీ. ప్రీతిచే గుహుఁ డిటు లెంత వేఁడికొన్న
నంబయాజ్ఞ వల్కలధారి యయిన నాదు
గాత్ర మర్హంబుగా దింక క్షాత్రవేష
ధృతికి నంచు వారించె నాక్షితివరుండు. ౪౭

గ. పిదప దాశరథులకు సమధుపర్కంబగు నాతిథ్యం బొసంగనో యన నరవిందబృందస్యందమాన మకరందబిందుసందోహవాహి యగు మందాకినీవాహినీమారుతంబు మందమందంబుగా వీచుచుండఁ గాకుత్స్థుకాననగమనావస్థం జూడం జాలకయో యన దినకరుం డపరాద్రివెనుకకుం జన రాముండు చరమసంధ్యావందనం బాచరించి యాతరుమూలంబున సౌమిత్రికల్పితం బగుపర్ణతల్పంబుం జేరి విశ్రమించె.

గీ. లక్ష్మణుఁడు సావిదల్లుఁడై రక్షసేయ
నింతితోఁ దరుమూలశుద్ధాంతమందు
నున్నరాముఁ జూచుచు నశ్రు లురలకుండ
బిగియఁ బట్టి గుహుఁడు నిద్ర వీడియుండె. ౪౮

గ. అంతఁ దెల్లవాఱె దివాకరుండు పూర్వాద్రిపైఁ దోఁప జటాబంధంబుల ధరించి రామలక్ష్మణులు భాగీరథీతీరంబున కరిగిరి. ప్రహృష్టాంతరంగుండై రాముండు సీతతో నిట్లనియె.

మ. సవనాశ్వంబును రోయుచున్ జనునెడన్ సంప్రాప్తమైనట్టిమా
నివరేణ్యాగ్రహనామకోగ్రరుజకున్ దివ్యౌషధాకారమై
దివికిన్ దాతలఁ జేర్పఁజాలిన మహాదృష్టంబునై యొప్పునీ
భవజూటాగ్రవినిస్రుతామరనదిన్ భాగీరథిన్ గొల్చెదన్. ౪౯

గ. తదనంతరము సాంత్వవచనంబులచే సుమంత్రు నయోధ్యకుం బంపి మంగళంబు లొసంగ నావియద్గంగను వేఁడుకొనుచున్న విదేహ

రాజపుత్రియు సౌమిత్రియుం దోడ రా రఘూద్వహుండు గుహుం డాయత్తంబు చేసిన నావ యెక్కి యాసురసరిత్పారంబుఁ దూర్ణం బుగా దాఁటి తోడ వచ్చెద నన్న గుహుని మానిపించి సస్యసం పన్నమగు వత్సదేశంబు ప్రవేశించి యారాత్రి యొకానొక చెట్టు క్రిందఁ గడపి మఱునాఁడు ప్రాతఃకాలంబున లేచి యరణ్యా మా ర్గంబున నరిగి ప్రయాగ క్షేత్రంబున హోమధూమ ప్రాగ్భారం బగు భరద్వాజాశ్రమంబు నాశ్రయించి కొంతతడవుండి పిదప నమందహర్షుండగు నామహర్షికి మ్రొక్కి తదాదిష్టమార్గంబున నేగుచు నడుమ యమునానదీపూరంబును వెదురు పుట్టల దాఁటి యెట్ట కేలకు శమధనజనసన్నిధానశమితశాత్రవసకలసత్త్వచరిత్ర విచిత్రంబగు చిత్రకూటముం జేరి,

గీ. సుదతితో నుంట సాకేత సుఖము నొంది
పంచమంబునఁ గోవెల ల్పాడుచుండ
ననుజరచిత పర్ణాగారహర్మ్యమందుఁ
జిరము రమియించె రాముఁ డాచిత్రశిఖరి. ౫౦

—*సుమంతుఁడు శూన్యరథంబుతో నయోధ్యకు వచ్చుట*—

గ. సుమంత్రుండును వనవాసాయాసాసహానంబున నైన రాముండు న న్నుఁ బిలిపింప కుండునాయనునాశతో నిషాదజనపతిసకాశంబునఁ గొన్నిదినంబు లుండి యంత నిరాశుండై యుత్సాహరహితంబగు నయోధ్య కరిగి దాశరథి లేకుండ సారథి యొక్కఁడే వచ్చి నాఁ డని పౌరు లాక్రందించుచుండ నరదంబు మెల్లమెల్లగా నడు పుకొనుచు రాజమందిరంబున కేగి ప్రయాణోన్ముఖప్రాణుండగు దశరథునకుఁ బ్రణమిల్లె. అతనింజూచి నంతనే విసంజ్ఞుండయి కౌ సల్యా సుమిత్రలు సమాశ్వాసింపఁ గొంతవడికు సేదదేఱి "రాముం డెట్లు ప్రయాణము చేసె. సీత యేమనియె, లక్ష్మణుం డెట్లున్నాఁ" డని దశరథుండు మఱిమఱి సుమంత్రు నడుగ నాతం డి ట్లనియె.

"దేవా, యే మని చెప్పువాఁడ. నే నెంతయుఁ గఠినహృదయుం డంగదా.

గీ. రథమునకుఁ బౌరజన మనోరథమునకును
దూరముగ నేగి జాహ్నవీతీరవనుల
సంచరించిరి నీసుతుల్ క్ష్మాతలేంద్ర
ధరణి తనయకు నవసౌఖ్యమ్ములగుచు. ౫౧

క. మఱియు,

చ. ఒలయు వసిష్ఠమౌని ముకుటోత్సవమందున వేల్పుటావుపా
లలఁదఁగ నోఁచలేని భవదాత్మజు కేశభరంబున న్నిపా
దులు గొని తెచ్చినట్టి వటదుగ్ధము లల్లనఁ జల్ల నక్కటా
యులవడెఁ బెన్జడల్ క్షితిజ యుక్తుల నక్షులు కాఱుచుండఁగన్. ౫౨

గీ. ప్రియునితోఁ గూడి చరియించు పృథ్వితనయ
కాలిగోళ్లను లత్తుక కలుగకున్న
రక్తవర్ణంబు శీఘ్రమే వ్యక్తమయ్యె
వదనమందున వైవర్ణ్య మొదవ లేదు. ౫౩

గీ. తలిరుసెజ్జ నన్నకుఁ గూర్చి ధనువుపట్టి
క్రూరసత్వము లారైకుండఁ దేటి కనుచుఁ
బుణ్యలభ్య రామచరణపూజ ననఁగ
నిద్ర లేకుండె సౌమిత్రి నిశలయందు.” ౫౪

—: దశరథుని శాప వృత్తాంతము :—

క. అని యిట్లు సుమంత్రుండు పల్కుచుండ భాస్కరుండు చరమ
శిఖరి శిఖరంబు నలంకరించె, నప్పుడు దశరథుండు హృదయ
లగ్నశోకశల్యయగు కౌసల్య నోదార్చుచు-

“తొల్లి యొకప్పుడు నేను మృగయాతత్పరుండనై సరయూ
సరిత్తీరంబున సంచరించుచు దివస్పతి నిబిడవనస్పతిషండంబు
చాటున మాటుపడి యుండ,

చ. మునియొకఁ డట్టివేళ ఘటము న్సరయూనది నీట ముంచ నా
ధ్వని విని యే గజంబనుచు బాణము నేయఁగ వాఁడు గూలె నా
తనితలిదండ్రు లంధులటఁ దాము నుఁ జచ్చుచుఁ గాంచె దీవునుం
దనయవియుక్తిచేత మరణంబని పెట్టిరి నాకు శాపమున్. ౫౫

గీ. వైశ్యునకు నేను శూద్రయగా వనితయందుఁ
బుట్టినాఁడను గావునఁ బొంద వీవు
బ్రహ్మహత్యచే నయ్యేడు పాప మనుచు
నీఱ్ఱతుండైన ముని యయ్యె స్వర్గతుండు. ౫౬

వ. కావున నే నవశ్యము మృత్యువశ్యుఁడనే." అని చెప్పి రామునే తలంచుచు నిర్వచనుండయ్యెను.

—♦ దశరథు మరణము. ♦—

గీ. అంత ననివార్య మైనట్టి యల్లశాప
వశముచేఁ బుట్టినట్టి విపత్తిచేతఁ
దడ వొకింతయు లేకయె దైవగతిని
దశమదశ నొందె దశరథధరణివిభుఁడు. ౫౭

చ. అరు లరికట్ట లేదు దివిజాలయముల్, దనుజారికాంతలం
జెఱలను బెట్ట లేదు, పురిచెంతకు వాసవుదూత లేని రా
రథము నెక్క లేదు, సచివాదులతోడను జెప్ప లేదు, తా
నరిగె ధరాధినాథుఁ డమరాధిపువీటికి శోకవశ్యుఁడై. ౫౮

వ. అంత నంతఃపురవధూజనంబు దశరథుం బ్రశంసించుచుఁ గైక యిందూఱుచు రాము గుణంబులం గణించుచు నేడ్చిన యేడ్పులచే దిక్కులు ప్రతిధ్వను లిచ్చె.

గీ. గ్లానసద్గణంబు నరాజకంబునైన
గగనభాగంబుఁ దానష్ట గనుటచేత
ననఁగ శాంతమై యొప్పుచు నవని యెల్ల
గ్లానసద్గణంబు నరాజకంబు నయ్యె. ౫౯

—♦ భరతుఁ డయోధ్యకు వచ్చుట. ♦—

వ. మఱునాఁడు ప్రభాతసమయంబున వసిష్ఠునాదేశంబుచే మంత్రులు దశరథు శరీరంబు తైలద్రోణియందు భద్రపఱిచి రాజవృత్తాంతం బేమియుం జెప్పకుండ భరతుని శీఘ్రముగాఁ బిలిచికొని రం డని దూతలం బంప వారును వాయువేగంబుగల గుఱ్ఱంబుల నెక్కి యశ్వపతిపురిం జేరి దుస్స్వప్న నిమిత్తంబునఁ బరిదూయమాన

మానసుండై యున్న భరతుం గాంచి గురునియోగంబును దెల్ప నాతండు మాతామహునివలనను మాతులుండైన యుధాజిత్తువలనను వీడ్కోలువడసి యనిమిత్త సంపాతసాతంకుండై కొలఁది దినంబులలో నయోధ్యం జేరి.

సీ. చనుచు వీథులయందు జనుల సంచారంబుఁ
గానక పురి తొంటి కరణిగాక
వేఱురీతిగ నుంట వికృతమనస్కుఁడై
పరిచరు ల్గొలువఁగా నరిగి యరిగి
పితృవనమును బోలు పితృభవనము సొచ్చి
తండ్రిఁ గానక మదిఁ దల్లడిల్లి
తల్లి యింటికి నేగి తగురీతిఁగా మ్రొక్కి
తండ్రి యేఁడి యనంగఁ దల్లి పలికె
"జనకు నాజ్ఞచే రాముండు వనికి నేగె
సీతయును లక్ష్మణుండును జేరి కొలువఁ
గాలధర్మంబు నీతండ్రి కనియె నంత
భయము వీడి యనుభవింపు వసుధ" యనుచు. ౬౦

క. వనమున మయూరి కేకను
విని భీతిం దల్లడిల్లు పెనుఁబాముగతిన్
జననీ నిష్ఠుర వాక్యము
విని యాభరతుండు మిగుల విహ్వలుఁ డయ్యెన్. ౬౧

—♦ భరతుఁడు కైకేయిని దూఱుట. ♦—

గ. భరతుం డంత విలపించి విలపించి విలుప్యమాన వివేకుండై కైకేయి కిట్లనియె.

చ. "పరిణత ఘోరపాతక నివాసమవో నిను నెల్లవేళలన్
ధరణిని బుత్త్రులం గనిన తల్లులుఁ దద్దయు దూఱుచుండ నా
కలుకునుడు ల్వినం బొడము గాఢతరార్తికిఁ గాక మాకు న
ల్వూరకును మాత నీ వనఁగఁ బోలదువో యిఁక నాతి యెన్నఁడున్"

వ. అని యామె ముఖమునుండి దృష్టిమరలించి తమ్మునితో నిట్లనియె.

చ. వనరుహబంధువంశ మిదె భస్మముసేయఁగఁ బూని తాపముల్
జనుల మనంబులందు వెదచల్లెడు నిమ్మహితాత్మ యుండఁగా
ననుసవం బపాపపురుషావళి పూజనభాజనాత్ముఁడౌ
ననలున కాశ్రయాశుఁ డను నాహ్వాయ మేగతిఁ గల్గెనో గదా.

గీ. పెక్కు రాత్మజు ల్గలయట్టి వేల్పుటావు
దున్నుచున్న దూడను జూచి దుఃఖపడియె
నేకపుత్రయౌ కౌసల్య యెట్టు లోర్వఁ
గలుగుఁ బెద్దయౌ పుత్త్రశోకంబు చెపుమ. ౬౪

గీ. విధివశమున నరేంద్రుండు వీతమంత్రుఁ
డైన వరయుగరసనల నానెఁ బ్రాణ
వాయు విడి దీనిఁ బరగడఁ బాఱవైవ
వలయుఁ బుట్టలుండెడు పితృవనమునందు. ౬౫

గీ. హీనమతి యీపె యాత్మగుణానురూప
పిశితభుక్కులవర్గము ల్పెక్కు లుండఁ
బూజ్యకేకయకులమందుఁ బుట్ట నేల
లసితమాకంద వనమందు ముసిఁడి ప్రోలె." ౬౬

క. జననీతివిహీన జనని
యనుచు న్నిరయంబు వీడి యరిగెడు గతినా
జననీనిలయంబు విడిచి
యనుజునితోఁగూడి భరతుఁ డవ్వడ చనియెన్. ౬౭

గ. చని యమాత్యులతోఁగూడి కౌసల్యం జేరి యాపె పత్యనుగమనాభిలాష శపథశతంబుల మాన్పి నిత్యయజనశీలుండగు పంక్తిరథునకు వసిష్ఠాదేశంబున యాయజూకానుగుణం బగురీతి నంత్యకర్మ మాచరించె. భరతుం డిట్లు కృతకృత్యుండై,

క. జనకుఁడు పితృవనమునకున్
జనఁగాఁ దా భ్రాతృవనికిఁ జనియెడుతలఁపుల్
మనమున బొడసూపఁ బ్రకృతి
జనములఁ బ్రార్థించె సెల వొసంగుడి యంచున్. ౬౮

వ. తదనంతర మమాత్యవర్గం బనునయింపఁ గౌసల్యా సుమిత్రాద్య వరోధజనసహితుండై మందిరంబున కేగి యందుఁ దండ్రి యౌర్ధ్వదైహికక్రియలు యథావిధిగా నిర్వర్తించిన పిమ్మట మంత్రివర్గం బాతనిం జేరి పట్టాభిషిక్తుండవు గావలయు నని ప్రార్థనాపూర్వకంబుగా నొక్కినొక్కి చెప్ప వారలతో నాతండు,

గీ. విపులమైనట్టి దండకావిపినమందుఁ
బర్ణశాలకుఁ దగుచోటు పడయునేని
మహిత సౌమిత్రివృత్తంబు మాని తలను
దాల్తు మకుటంబు మీమాట దాఁటనగునె. ౬౯

వ. అనుచు రామసేవోత్సుకమానసుండై గృహంబునుండి వెడలె. తత్కాలమందు.

ఆ. వె. సత్పథంబు పాంసు సక్తంబుగాఁ జేసి
సుజననయనసుఖము స్రుక్కఁజేసి
మహిపుగృహమునుండి మంథరానామక
చటులవాత్య వెడలెఁ గుటిలగతిని. ౭౦

గీ. అపుడు రామానుజానుజుం డల్లకూళ
దాసికేశపాశంబు హస్తంబుచేతఁ
బట్టి దానిఁ దత్క్షణమ చంపంగఁజూడ
వలదు వల దంచుఁ గౌసల్య వదిలిపించె. ౭౧

— రామునిఁ గన భరతుం డడవి కేగుట —

వ. భరతుండు నంతఃపురజనంబుతోఁగూడి పురము వెలువడిపోవుచుఁ బ్రసృతనరగజ తురగ చరణక్షుణ్ణక్షోణితల సముత్పన్న రేణు నికురుంబంబున నంబరగంగ జంబాలవంతంబు గావించుచు సుమంత్ర ఫణితగుణనివహుండగు గుహుని యనుమతిని గంగ దాఁటి భరద్వాజాశ్రమంబు సమీపించి సేనను ద్వారమందు నిలిపి తా లోపలకుం జని యమ్మునిపతి కభివందనంబొనర్చె. మునివర్యుండు సంప్రీతమనస్కుండై భరతుని జననీ జనంబును సేనను బ్రత్యేకమాదరించి యాతిథ్యం బొసంగి,

గీ. భ్రుకుటి భటకల్పు దివిజుఁడౌ మునివరుండు
భరతుతోఁగూడివచ్చిన బలముకెల్ల
షడ్రసోపేతమౌనట్లు సలిపె విందు
నమరులకుఁ గూడ నోరూరునట్లుగాఁగ. ౨౨

గ. ఆదిన మచ్చట మూఁడుదినంబులుగాఁ గడపి మఱునాఁడు మునివరు ననుజ్ఞంగొని భరతుండు చిత్రకూటవనముం బ్రవేశించి సైన్యము నొక్కచోట నిలిపి గుహునితోఁగూడి యన్నయున్నచో టన్వేషించుచు హవ్యగంధబంధురుండగు గంధవహుండును హోమధూమంబును జాడం దెలుపం జనిచని బెదురులేక నిర్భయముగా విహరించు మృగాళితోడను, అదృశ్యాకారలౌ వనదేవతలు వెదచల్లెడు బలికుసుమంబులచేతను, అశేషపిశితాశన పిశాచోచ్చాటన మంత్రాయమాణంబగు లక్ష్మణ చాపఘోష శ్రవణంబుచేతను, నూతన పరికల్పిత పర్ణశాలావాస్తవ్య వైఖానసకుటుంబినీ నివహంబుతోడను, జెట్టుకొమ్మల కాఱంగట్టిన వల్కలాజినంబులతోడను రాజిల్లుచు నొక్కచోట వియచ్చర కరపల్లవంబులనుండి రాలెడి సురతరుకుసుమ విసరంబుచే నర్చింపఁబడు జానకీనివాస తరుమూలవేదికయు, నొక్కయెడ ఖడ్గకార్ముక నిషంగంబులును, వేఱొకతావున నతిథిసంతర్పణార్థంబు సౌమిత్రి తెచ్చియుంచిన కందమూల ఫలనికరంబును, నెల్లెడ సాకేతపురశోభకంటె నధికంబగుశోభ నాపాదించు జనకతనయాచరణసరసిజముద్రావిన్యాసంబును గన్నుగవ కాతిథ్య మొసంగఁ గడునభిరామంబగు రామాశ్రమంబుం జేరి,

—* శ్రీరామ భరత సమావేశము *—

ఉ. శాంతినివాస మానతని సజ్జనగమ్యుని వల్కలాంబరుం
గాంతవినూతనాంబుధరకాయు సరోజదళాయతాక్షు న
త్యంత నిబద్ధ భాసుర జటాభరణు న్ఫణిరాజబాహు శ్రీ
మంతునిఁ గాంచె నంత వనమధ్యమునన్ ధరణీసుతాయుతున్. ౨౩

గీ. కాంచి చెంగటఁ గమలారికళయునంగ
నలరుదానినిఁ బద పంకజాంకతతుల
వనము సాకేతపురిసాటిఁ దనరఁజేయు
దాని జానకిఁ గాంచి వందన మొనర్చె. ౭౪

గీ. పదప నెవనికి సౌమిత్రి పదముకంటె
మహిత రామానుజత్వంబె విహితమయ్యె
నెవని కన్గవ కీడగు నెపుడు మూఁత
గనని కమలయుగ్మ మతనిఁ గనియె నతఁడు. ౭౫

గ. తదనంతర మతిరూక్షంబగు నెడారిలో భీష్మంబగు గ్రీష్మంబున నీర్వట్టుచే డస్సి తహతహపడు కృష్ణసారము భాగ్యవశంబునఁ గంటఁబడ్డసుధారసమధురవాఃపూరితకమలాకరంబునకుఁ బాఱు పగిది భరతుండు రామునొద్దకుఁ బరుగునఁ బోయి యాతని పాదంబులపైఁబడి యేడ్చి యేడ్చి యెట్టకేలకుఁ బితృవృత్తాంబుఁ దెలుప సీతారామలక్ష్మణులు శోకవశ్యులై మూర్ఛిల్లిరి. జనసీజ నంబును నేలఁబడి కడుంగడు విలపించిరి.

గీ వారి శోకసాగర మంత మేఱమీఱి
పట్ట శక్యంబుగాక తాఁ బరిఢవిల్ల
నల్ల సంరంభ మడఁపఁగా నాత్మవేది
యౌ వసిష్ఠుండు కుంభజుండయ్యె నపుడు. ౭౬

గీ. అంతఁ గొంతసేపటికి లబ్ధసంజ్ఞులై గురునిదేశంబుచే సురసరిద్వా రంబున నివాపకృత్యంబు యథావిధిగా నిర్వర్తించి యున్న యన్నం దిరిగి సాకేతపురంబునకుం గొనిపోవు నాశతో భర తుండు వికర్తనకులానుకూలంబును, గుణగణానుగుణంబును, యశోరూపానురూపంబును,సదాచారసముచితంబును, ప్రాచీన భాగ్యయోగ్యంబును, శ్రుతసదృశంబును, లోకగర్హణానర్హంబు నగు రీతిం బ్రార్థించి ప్రార్థించి "క్షణభంగురలక్ష్మీసమావేశ లక్షణంబయి పలువురు రాజు లింతకుఁ బూర్వము ధరించి విడిచి నట్టి ముకుటమ్ము నే ధరింపనొల్ల. మీరలు పాదుకలచే నన్నలంక

రింపుం"డని యుత్తమాంగంబు రాముపాదములం బ్రార్థించు చున్నదోయను రీతి నాతనిపాదంబులపైఁ బడి లేవకయుండ,

గీ. సత్యవాగ్ధురీణుండైన జనకువంపు
నీవు నేనును గూడి చెల్లింపవలయుఁ
గాదె యంచును ధర్మ్యంబుగాఁగఁ బలికి
భరతవాక్యంబు రాముండు పరిహరించె. 22

గ. జాబాలిప్రార్థనంబుగూడ నట్లె వ్యర్థంబుగాఁగ భరతుండు.

—* భరతుండు నందిగ్రామము చేరుట. *—

గీ. అన్నఁ బ్రార్థించి తత్పాదుకాఖ్యమహిత
మకుటయుగళంబు చేకొని ప్రకట వల్క
లాంబరుం డౌచుఁ దమ్ముతో నరిగి యాత్మ
విషయమును జెందియు విషయవిముఖుఁడయ్యె. 23

గ. నిజదేశంబుఁ జేరియు "నన్నగారు వనవాసంబునుండి వచ్చుదాఁక నే నయోధ్యలో నివసింపంజాల నాతం డవధిలోవల రాక తడవు చేసెనేని నాశ్రయాశు నాశ్రయించి యయినఁ బ్రాణతర్పణం బొనరించెద" నని నిశ్చయించి నందిగ్రామంబను నాశ్రమంబు నాశ్రయించి యుండె. రాముండును యోగిజన బృందంబునకుఁ బుణ్యజనసందోహంబు లొనర్చుచున్న బాధల విని వానిని మాన్పం గాననగర్భంబుం బ్రవేశించి,

గీ. మేఁత సైతము మాని నిర్భీతిగాఁగఁ
దివిరి కానన హరిణము త్రేటి చూడ
రాముఁ డత్రిమహర్షి యాశ్రమముఁ జేరి
యాతఁ డొనరించు నాతిథ్య మందుకొనియె. 24

గ. ఆమహర్షిపత్ని యగు ననసూయ తనయాభరణంబుల సీత కొసంగి సంతోషపెట్టె. తదనంతరము,

క. ధరణీ హృత్పంకజహిమ
కరులౌ నరుల న్హరింప గాకుత్స్థుఁడు స
త్వరముగఁ జొచ్చెను దండక
యరుణాంశుఁడు మబ్బులోని కరిగెడుభంగిన్.

ఇది శ్రీమత్కౌశికగోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకరసుధాకర రామయ నామధేయ
ప్రణీత ఆంధ్రచంపూరామాయణంబునం
దయోధ్యాకాండము సంపూర్ణము.

---

# అరణ్యకాండము.



చ. స్ఫురదురుకాననాంతరము సొచ్చి మహాబలయుక్తుఁ డౌచు సం
చరదతినీలశైలగతి శక్రవిరోధిదవానలార్చులన్
శరముల నార్పఁబూని పటుచాపముఁ దాలిచి మైథిలీశుఁడున్
సురపథవర్తినీరదము సొంపు వహించి చరించె నెల్లెడన్. ౧

—: విరాధ వధ :—

గ. ఇట్లు సంచరించుచుఁ దీఁట వాపుకొనంగ నడవి యేనుంగులు కణఁతలతో రాచికొంటచే సాలభూరుహంబుల నుండి కాఱునిర్యాస గంధంబును మాఱువఱుపంజాలు నాహుతి గంధంబుం బట్టి యాశ్రమభూముల కరిగి మానివరు లొసంగు నాతిథ్యంబుచే మార్గశ్రమం బపనయించుకొనుచు విహరించుచున్న యా రామలక్ష్మణుల దారి కడ్డము వచ్చి వివిధమృగశవశతంబులు హృదయంబున వ్రేలాడుచుండ రోషభీషణవేషుండై శతహ్రదాతనయుండగు విరాధాభిధానయాతుధానుండు సీతను బలవంతంబుగా లాగికొని రామలక్ష్మణులతో. "తరుణవయస్కుల రగు మీ రెవ్వరు! ఎక్కడనుండి వచ్చితిరి? మీ యాచారము వామాచారముగాఁ గాన్పించుచున్నది. మేన నారచీర, శిరస్సున జట, కరమునఁ జండకోదండము. ఈ మీ యాకల్ప మేడ? అల్పాభరణయయ్యుఁ గల్పలతాకల్పయగు నీ తరుణి యేడ!" అని పలుక రఘుకులతిలకుండు వానికిఁ దమవంశాది వృత్తాంతంబుం దెలిపి వాని యంకంబునుండి కంపించుచున్న జనకతనయం గాంచి సరోష చిత్తుండై వాని వక్షంబున శిలీముఖంబుల నాటె.

గీ. కమలగర్భుని వర మనుకవచ మొప్ప
రాక్షసాధముపైఁ బడ్డ రామభద్రు
విశిఖము ల్విశిఖంబులై విచ్చిపోయె
వాఁడు శూలంబు నతనిపై వడిని బఱపె. ౨

గీ. అంత నెంతయు శితశిఖం బైన యట్టి
యసుర శూలము న్వాను వెంట నసురరిపుల
హృదయ శూలముఁ ఖండించె విదితముగను
క్షణములో రఘునాయకుసాయకంబు. 3

వ. విరాధుండును గ్రుద్ధుండై గతినిరోధాపరాధ పరిహారంబుగా నన దివాకరసుధాకరులం బ్రస్థంబునం దాల్చిన వింధ్యాద్రి వోలె రామలక్ష్మణులం దన బుజములపైఁ బెట్టుకొని నడచుచుండె. సౌమిత్రి వానిం జంప నుంకింప వారించి రాముం డతని కిట్లనియె.

కం. దనుజుం డేగెడు నదియే
మనమును బోవలసినట్టి మార్గము గానం
జననిమ్ము వాని స్వేచ్ఛను
దునుమంగా వలదు వాఁడు దుష్టుం డైనన్. ౪

వ. అంత.

కం. నను ద్రింగి వీరల విడువు
మని యతికరుణంబుగాఁగ నఱచెడు సీతం
గని వారిరువురుఁ గత్తుల
దనుజు భుజంబుల నఱకిరి తత్క్షణ మందున్. ౫

వ. అట్లు చేతులు నఱికి తీక్ష్ణ ప్రహరణంబుల వానివక్షంబు గవాక్షంబు పగిదిఁ గావించి బోరున రక్తము గాఱుచున్న వాని దేహముం బూడ్చుటకై విశాలంబగు నవటంబుఁ ద్రవ్వుచుండ నారక్కసి లబ్ధసంజ్ఞుండై తాను గంధర్వవంశసంభవుండగుటయు రంభం గౌఁగిలింప నుంకించుటచేఁ గుబేరుం డలిగి రాక్షసరూపంబు వచ్చునట్లు శపించుటయు రామునిచేఁ జచ్చుటయే యా శాపంబున కవసానం బగుటయు దాశరథికిం దెల్పె. పిదప,

గీ. అసురభంజన మారంభమయ్యె ననుచు
దివిజలోకమునకు వీఁడు తెలుపునట్టు
లురగలోకంబునకు వీనియొడలు తెలుపుఁ
బోయెనుచు రాముఁ డద్దానిఁ బూడ్చివైచె. ౬

— :శరభంగమునిదర్శనము :—

గ. అక్కడనుండి రాముండు నాకలోక నివాసార్థ మాఖండలునిచే సమాహూతుండైన శరభంగ మహర్షియాశ్రమంబునకుం జనియె.

క. సురపతి తనకంటికి గో
చరుఁడై యుండినను గూడ జనియించెను దా
శరధి సిషేవిష మనసిజ
శరభంజక వృత్తియైన శరభంగునకుఁ. ౭

గ. అమ్ముని రాము నాతిథ్యంబున నారాధించి తత్సాన్నిధ్యంబున శుదంబయిన నిజదేహంబును మంత్రపూతంబుగా నాహుతింబోలెఁ బ్రజ్వలించుచున్న హవ్యవాహానునందుఁ బడవైచి శాశ్వతపదం బునందె. అటనుండి బయలుదేఱి రాముండు తీక్ష్ణతపుండగు సుతీక్ష్ణునాశ్రమంబునకుం జని యమ్ముని వర్యు సందర్శించి తదను మతి వడసి బయలుదేఱి జలనిధిపానంబుచే జీవనాభావశంక గలిగి శరణంబు వేఁడ వచ్చిన నీలాంబుదసందోహంబో యను సందేహంబున కాస్పదంబై యున్ననానానోకహ నివహంబుచే మ ఱుంగుపడియున్న యగస్త్యాశ్రమంబుఁ జేరి రాముండు రామ కిట్ల నియె.

—♦ అగస్త్యముని వర్ణన ♦—

గీ. నదులకెల్లను నాథుఁడౌనుదధి యెవని
కరకమలమున మకరందసరణి నొప్పె
నట్టి మహితానుభావ సంయమివరేణ్యు
నాశ్రమం బిద్ది చూడు మోయంబుజాక్షి. ౮

గీ. సమదగజహస్తభరముచే శాఖలెల్ల
వంగియున్న యీ సల్లకీపాదపమిదె
యిమ్ముని కరభరమ్ముచే నేపు తగ్గి
యడఁగి యున్నట్టి వింధ్యాద్రి నభినయించు. ౯

గీ. వనగజంబులు పెనుబాట యనెడుబుద్ధి
వక్త్రములఁ జొచ్చి తిరిగి వెల్వడఁగలేక

యట్టె తిరుగాడుచున్న యీయజగరములు
దనుజులకు నల్ల వాతాపిదశను దెలుపు. ౧౦

చ. చుళుకగతాంబురాశిఁ జవిచూచెడునప్పుడు దానిమీఁద నీఁ
గలగతి మూఁగుమబ్బుల నగస్త్యుఁడు వామకరంబుచేతఁ దా
వెలలఁగఁ ద్రోసి నవ్విను విసువీచని బాసి వనాళిఁ బల్వలం
బులకడఁ జేరె గాఁగ వెనుపోతులు క్రుస్సురుఁ జూడు మిచ్చటన్.

గ. ఈగతి విపినవిలోకనవిస్మితమతియై యుటజములం జేరి మునిశిష్యులు గొనిపోవ లోనికిం జని బృందారకపరివృతసకలలోక వంద్యమానచరణారవిందసంభవుం బోలె మునిబృందారక పరివృతుండును, భుజంగభావదూషితనహుషద త్తభుజంగభావుండును, ఖగగతినిరోధనకల్యవైపుల్యసురవగాహనమహావనవింధ్యశైలసింధురాజగాధతాగాధతా తిస్కారకరోదరుండును, సుదరజాతజాతవేదోవిరచిత వాతాపిదానవానలేపలోపుండును, లోపాముద్రావల్లభుండును, సరిద్వల్లభనిశ్శేషీకరణ బాడబుండును, బాడబప్రశస్తుండునయి యపాస్తసమస్తాఘుండయ్యు నుపగతదక్షిణాఘుండై, వృష్టికతాసజన్ముండయ్యుఁ గుంభజన్ముండు నయిన భగవంతుండగు నగస్త్యుని దర్శించి,

గీ. భానుప్రభవోలెఁ దమమును బాఱఁదోలు
బ్రహ్మతేజంబు నియతిమైఁ బరసినట్టి
యలతపోనిధి కమితశౌర్యాలయుండు
రాముఁ డాత్మనామము చెప్పి ప్రణతిచేసె. ౧౨

—♦ రాముఁడు పంచవటియందు నివసించుట ♦—

గ. పరమహర్షుండగు నమ్మహర్షివలన నాశీర్వాదంబులతోఁగూడ వైష్ణవచాపంబును, బ్రహ్మాస్త్రంబు, నైందవంబగు తూణీరయుగ్మంబును, సువర్ణమయకోశం బగుఖడ్గంబును, బడసి రాముం డమ్మహాత్మునాజ్ఞచే గోదావరీతటనికటంబునఁ బ్రకటితం బగు పంచవటియందు నివసించె. అచ్చట నప్రతిద్వంద్వుండును, విస్తృతవక్షుద్వంద్వుండు, నతిశౌర్యావస్థాప్రత్యయుండును, దార్క్ష్యోప

ముండును, మహామహీధ్రకల్పుండు నగు గృధ్రరాజు నొకనిం గాంచె.

శా. మైనాకుండు మునీంద్రపీతజలసంభారోదధి న్వీడి యా
మానిం జేరి భజించునో యనెడు రామభ్రాంతి వారించె నా
శ్యేనీపుత్రకుండౌ జటాయు వమలస్వీయాన్వయఖ్యాతిచేఁ
దా నయ్యాజికి నిష్టబాంధుండగుటం దథ్యంబుగాఁ జెప్పియున్. ౧౩

గ. రాముండును సంపాతియనుజుం డగు నాకాశ్యపసంజనితుని జనకునిం బోలెఁ జూచుచుఁ బంచవటి ననుజకల్పితపర్ణశాలయందు నివసించియుండె. అంత దురంతం బగుహేమంతం బెంతయు విజృంభించె. మనోభవవైభవ మతిశయించె. పిశంగకలమమంజరీపుంజపింజరితంబులై కేదారంబులు ముదావహంబులయ్యె. పంచబాణరణప్రయాణోచితవీరపాణంబు నా మంచుబిందువులు తరుపత్రపుటపాత్రంబులందు మెఱయుచుండె. జనులకుఁ జంద్రాతప చందనానులేపంబులు, చంద్రశాలలు, చంద్రోపలస్థలంబులు, వాతాయనసేవనంబు, వాపీకూపోపకంఠంబు, వాసరావసానంబు, వారివిహారంబు, నుత్పలమాలలు, నుపవనవిహారంబు నసహ్యంబులయ్యె. గంభీర గృహగర్భ భాగంబులు, దట్టంబులయిన దుప్పటులు, శశోదరలోమ మృదుల కంబళంబులు, కాలాగురు ధూమంబు, కాశ్మీరాంగరాగంబు, నిర్ధూమాంగార భరితంబులగు కుంపటులును, ప్రియంకరంబు లయ్యె. మదనకరేణుకరవికీర్ణ శీకరాయమానం బగు తుషారధూళిచే వాసరంబులు ధూసరంబులయ్యె. సరసీరుహంబులకుం జలి దావపావకంబయ్యె. చలిచేఁ బగిలిన లాసికాధరదళంబుల దంతక్షతంబులు కఱవయ్యె. ముదిలంజియల యెడఫులువ్రాలెఁ జలిపడుట్లు పాడుపడియె. విసనకఱ్ఱల కాటవిడుపు లభించె. మెండగు వెట్ట యుండజయానల చనుగొండలను కొండకోటల నంజికవిడచి యండగొనియుండె. దివాకరునివలన దివాభీతవ్రాతంబునకు భీతియు, సుధాకరునివలనఁ జకోర నికరంబునకు క్షేమంబును, కమలాకరంబులవలనఁ గాదంబకదంబంబులకు

ముదంబును, మందగించె. హృదయ కమలంబు లివముచే నిడియుండఁ గప్పటకో యన వక్షంబులపైఁ జేతులు స్వస్తికముద్రాకారంబుగఁ బట్టి శీతోచ్చారణమంత్రంబు జపించురీతిఁ బెదవులు కదలుచుండఁ బండ్లు కొఱికికొనుచుఁ గరుణాకరుండగు సరసిజసంభవుం డొసంగిన కంబలి నా నొడలగపడకుండఁ బులకలలను కొన భిక్షాటనం బొనర్చు నిరుపేదలపై లక్ష్మీకటాక్షవీక్షణాబాకపరియైనఁ బజపకున్న దను ననూయుచేఁ దదావాసంబుం గాలంబు భగ్నము చేయుచున్నదో యన సరసిజంబులు డంబఱి భగ్నంబులయ్యె. అంగజమతంగకరపుష్కరోద్ధితశీకరనికరాకారంబులు, నతిపరుమస్మరశరనిపాతప్రతప్త గగనాంగ ప్రవత్స్వేదసదృక్షంబులు నగు హిమప్రసరంబులు పాంథహృదయ మర్మంబుల భేదించె. పెక్కులేల.

గీ. కడిఁది విరహాగ్ని యుడుకునఁ గ్రాంతలైన
కాంత లెవ్వేళ నంతంబు గనఁగలేరు
నిశలకును దుస్సహంబైన వ్యసనములకు
నట్టి హేమంతకాలంబు మిట్టిపడియె. ౧౪

—♦ రామలక్ష్మణులయొద్దకు శూర్పణఖ వచ్చుట ♦—

క. అట్టితఱి శూర్పణఖ పర్ణశాలలో నున్న రాముం జేరి.

చ. విరివిగ దిక్కుల న్గగనవీథిని నెల్లెడ మంచు గ్రమ్మఁగా
గురుకుచభారసుందరులఁ గూడనివారల నేచున త్తఱి
న్వరునిగఁ గోరె నా యసురభామిని రాముని మాంసబుద్ధిచే
సరసిజగేహచేతిజలజంబును శ్యేనము గోరు తీరునన్. ౧౫

గ. రాముండు దానితో "నాకు భార్య యీజానకి గలదు. నాతమ్ముండు మహాబలయుతుండు. అబలావియుక్తుండై యున్నవాఁడు. నీ వాతని నాశ్రయింపు"మని పలుక నారక్కసి సౌమిత్రికడ కేగి తన యభిలాషం దెలుప నాతండు "భద్రా! యిది యుచితంబు గాదు. నే నాయన దాసుండను. సత్కులప్రసూతులగు నారులు దాసభార్యలుగా నుండఁదగదుగదా! కావున నీవు తిరుగ నేగి యాయననే భజింపుము. క్రూరమృగంబులతో నిండియున్న యరణ్యా

బులో సంచరింపఁజాలని జానకి న్విడిచిపెట్టి నిన్నాతండు పరిక్షి
హించు"నని చెప్ప నది యది హితం బని తలంచి యట్లొనర్చె.

గీ. ఉభయకూలసమస్థితి నొప్పు శాద్వ
లములఁ గన్నగోవుపగిది లలితమూర్తు
లయిన యన్నదమ్ములఁ గని యసురవనిత
బ్రమసి యిటునటుఁ దిరుగాడెఁ బాలుపోక. ౧౬

గీ. శూర్పకారాతిబాధితశూర్పణఖర
యసురనాథుసోదరి వృషస్యంతి యగుచుఁ
బృథువృషస్కంధు రఘువీరు వెంబడించి
యదియె పని గాఁగఁ దిరుగుచు వదలకుండె. ౧౭

గ. ఇట్లు తిరుగుచు ననన్యయువతిసామాన్యం బగు జానకిభాగ్యం
బును, రాముని రూపాతిశయంబును బరికించి యిట్లని వితర్కించె.

ఉ. ఈనలినాక్షిపోలిక గనేల సృజింపకపోయె ధాత న
న్నీ నవపుష్పబాణుమది కెక్కుడునట్టుల నేల యిచ్చెనో
తాను మమత్వము న్విడిచి తాపసవృత్తిఁ జరించు వీనికిం
గానను గాచినట్టి నెఱకౌముదిపోలిక నిట్టి యందముల్. ౧౮

ఉ. కోరఁగరానిదాని మదిఁ గోరి ధరాత్మజ నాహరింపఁగాఁ
గోరెడు రావణానుజను గొబ్బునఁ బట్టి సుమిత్రపట్టి సా
కారములైన క్రోధమును గామము నాఁ దగుదానిశ్వాస ల
వ్వారిగ సంచరింపఁ దరవారిని దారి నొనర్చెఁ బెద్దగాన్. ౧౯

గ. అంత శూర్పణఖ శీఘ్రంబుగా జనస్థానంబం దున్న తనయన్న
ఖరునియొద్దకుం బోయి తనపరిభవంబును జెప్పి చూప నాతండు
చతుర్దశాధ్యక్షరక్షితంబును జతుర్దశసహస్రసంఖ్యాకంబును నగు
రాక్షసబలంబును రామలక్ష్మణులను బట్టి తెం డని పంపె. శూర్ప
ణఖ చూపినదారి ననుసరించి వచ్చుచున్నయారాక్షససేనను జూచి
నివురుగప్పిన నిప్పుం బోలియున్న యాదాశరథి సీతను గాచి
యుండఁ దమ్ముని నియోగించి తా నాయాతుధానుల నందఱఁ

బరిమార్చె. తదనంతరము జటాయుని దేశంబున దనుజశవంబుల నవలకుం గొనిపోయి తపోధనాధ్వంబు శుద్ధిచేయ దేశాంతరంబు లనుండి వచ్చెనో యన నసంఖ్యాకంబు లగుకంకకాకప్రాచీకాది పక్షినివహంబు మూఁగికొని రామశరంబులచే శకలీకృతంబు లయిన యానిశాచరశరీరావయవంబుల నెత్తికొని ప్రతియుటజం బునకుం జని యివి తపోధనుల వధించినకరంబు లివి యెప్పుడుఁ బరుషభాషణంబు లాడుచుండినతాలువు లివి సిగ్గుమాలి పరదారల నీక్షించుచుండినకన్నులు అని చూపుచు నిరవకాశంబుగా నాకాశంబు నాక్రమించె. త్రిశిరస్కుశిరస్సులు ఖండితంబు లయ్యె. చచ్చియు దూషణుండు శరీరమునుండి కాఱుచున్న నస్రస్రోతంబుచే నాశ్రమవాసులఁ బీడించుచుండె. ఇది యెల్లఁ గాంచి రోషభీషణవీక్షణుండై ఖరుండు రాఘవు నాహవంబునకుం బిలిచె. అప్పు డా యిరువురకు ననిమిషులు సైత మెఱుంగని శరసంధానమోక్షణరీతులతో నొప్పి జయాపజయంబులు కోదండవిద్యాశౌండులకుఁ గూడఁ గానరాకుండ నభూతపూర్వం బగు ద్వంద్వయుద్ధం బయ్యె. ఖరుండు శరాసనంబు చేపట్టి వైష్ణవచాపంబును జేతఁ బట్టింపనో యన రాముచేత నున్నచాపము నమేయముగా నఱకి వైచె నాతండు కోపాగ్నిచే మొగము జేవురింపఁ గుంభసంభవుం డొసంగిన శరాసనంబుఁ బూనె.

క. ఖరకరకులాధినాథుఁడు
ఖరపర్వశరాసనంబు కరమునఁ బట్టెన్
ఖరరఘువీరులసమరము
ఖరనఖరాయుధసమరము కరణి నడంగెన్. ౨౦

కం. ఖరవధముచేత దండక
పరిశుద్ధం బౌట మునులు పరిపరి దీవిం
చిరి ముందర మంథర నటు
తరువాత గుణాఢ్యులైనదశరథసుతులన్. ౨౧

గీ. మంథర యనంగ మఱి రాజమహిషి యనఁగ
వరయుగంబన నరపాలుపలు కనఁగ
రామువనవాసకథ నాఁగ [illegible]ణుఁడు
లేనిజగములసౌభాగ్యరేఖ లివ్వి. ౨౨

వ. పిమ్మట శూర్పణఖ కాకుత్స్థునిచే జనస్థానంబునుంబోలె లంకను గూడ విజనస్థానంబును గావింప దశకంఠుప్రోల కేగి కృత్యాకృతి నేలం బడి రామలక్ష్మణులవృత్తాంతంబును సీత సౌందర్యంబును ఖరప్రముఖసహితంబుగాఁ జతుర్దశసహస్రసంఖ్యాకం బగు సేన పంచత్వంబు నొందుటయుఁ దన్నిమిత్తం బైనదనయవమానంబును విన్నవించె.

గీ. దండకారణ్యమం దట్లు దండనంబు
గన్నతన చెల్లెలి నెదుటఁ గాంచి రాము
చరిత మఖిలంబు విని యంతఁ జాలఁ గినిసెఁ
బ్రథితబలుఁ డైన రాక్షసపార్థివుండు. ౨౩

వ. కినిసి జనస్థానసంరక్షణార్థం బెక్కండ్రు రాక్షసుల నంపి దుష్టనీతి యగునానిశాచరపతి తాటకేయహాటకమృగంబును దీముగాఁ బెట్టి సీతాహ్వయం బగుహరిణంబుం బట్టం దలంచి మారీచునింటికిం బోయి తన యుద్దేశంబుం దెలిపి వాఁ డెంత వేఁడికొన్నను బట్టిన పట్టు విడువకున్న మారీచుండును జేయునది లేక సుబాహుభాగ్యముం గొనియాడుచు జాతరూపమయమృగరూపంబు దాల్చి వైదేహిని వంచింపం బంచవటిం బ్రవేశించె. దశకంఠుండును రథంబు జలధరపథంబున నుంచి రామలక్ష్మణులయెడఁ బాటునకై యెదురు చూచుచుండె నంత.

—* రాముఁడు మాయలేడిని వెంబడించుట *—

చ. వన మటు సొచ్చి యెల్లెడలఁ బాఱుచుఁ గేరుచు నచ్చటచ్చటన్
దనుజకపాలరాశిఁ గని తద్దయు బాష్పము లూర నేడ్చుచున్
సునిశితబాణజాల మనుచొప్పున నొప్పు కుశాగ్రభాగముల్
తినియెడునట్లు తోఁచుపగిది న్విహరించె మృగంబు డంబునన్. ౨౪

గీ. దయిత వేఁడంగ నప్పుడు దానిఁబట్ట
వెంటఁ జనుదెంచె రాముండు విల్లుపట్టి
మౌనిమఖవేళ మిగిలినవీనిఁ ద్రుంప
నిదియ తఱి యంచు నేతెంచె మృత్యు వటకు. ౨౭

గీ. ఆశ పుట్టించి కడుదూర మల్లఁ దిగిచి
రామశరవిద్ధుఁడై రామురవముఁ బోలు
ధ్వని నకట చచ్చినాఁడ నే ననుచు నఱచి
పైఁడిలేడి వేషము వీడి వాఁడు చచ్చె. ౨౮

—* లక్ష్మణుఁడు సీతను వీడి రామునొద్దకుఁ బోవుట *—

వ. అయ్యార్పు విని సీత విదీర్ణహృదయయై కర్తవ్యాకర్తవ్యంబు లెఱుంగక "మీయన్న యున్నస్థితి కనుంగొని ర" మ్మని సౌమిత్రి నాజ్ఞాపింప నతండు "అమ్మా! అట్లు చేయందగదు. దైవదుర్విపాకంబుచే మిథ్యాప్రతీతి నమ్మి నీవు మోసపోవుచున్నదానవు. త్రిభువనైకధనుర్ధరుండును శౌర్యరాశియు నగుమాయన్నగారు రాక్షసకీటకంబుచే విపత్తిం బొందు నని యెవ్వరు నమ్ముదురు." అని యెంత చెప్పినను వినక హృదయమర్మచ్ఛేదకంబు లగుమాటలాడి మోహవిహ్వల యగుజానకి యాతనిం దర్జింప నతండామెతో.

గీ. మును సుమిత్రవై యత్యంతముదము గలుగఁ
జేసితివి నాకు విధిదుష్టచేష్ట నిపుడు
కానిపలు కిటు పలికిన కతన నీవు
మధ్యమాంబవైతి వనుచు మదినిఁ దలఁతు. ౨౯

—♦ సన్యాసివేషమున రావణుఁడు సీతను గొనిపోవుట ♦—

వ. అని పలికి యన్నయొద్ద కేగె. అదను వెదకుచున్నదశవదనుం డది సందు చేసికొని రథము వీడి నేలకు దిగి యంతఃకరణంబున నిండుకొన్న యత్యంతానురాగముం బ్రకటించురీతిఁ గాషాయవస్త్రంబులు ధరించి కపటసన్యాసి వేషంబునం బర్ణశాలం జేరి.

గీ. లక్ష్మణుఁడు లేమి రామునాశ్రమము నుండి
చపలదనుజుండు జానకి నపహరించెఁ
బలల మనుబుద్ధిని నలర్క మలరుదండ
జనులు లేనట్టి గుడినుండి కొనెడుభంగి. ౨౮

సీ. హా నాథ నీ విట్టు లాలస్య మొనరింపఁ
గత మేమి యెయ్యెడఁ గల వటంచుఁ
గన్నీరు చక్షుల మున్నీరుగాఁ గాఱ
దిక్కులు చూచుచు దిగులుఁగొన్న
దశరథుకోడలి విశదంబుగాఁ జూచి
యోరీనిశాచర యోరితులువ
విలపించుసాధ్విని విడువుమీ యనుచును
ధర్షించి రావణుదారి నడ్డెఁ
బక్షిరాజొ జటాయువు పటిమతోడ
వారి కిరువుర కపు డయ్యె ఘోరసమర
ముగ్రకోపంబుతో వార లుద్ధవిడినిఁ
దాఁకి రోఁడొరులను గడు దర్పమునను. ౨౯

గీ. అంత దశకంఠుఁ డేసిన యాయుధములఁ
బక్షములచేత వారించి తత్క్షణంబ
రథ్యముల వెనువెంట సారథిని జంపి
యసురయరదంబు విఱిచె జటాయు వేచి. ౩౦

గీ. అసురయసిచేత క్షతుఁ డౌచు నాక్షణంబ
పడియెఁ బుడమిపైఁ బతగరాడ్వల్లభుండు
జనకజననాథుతనయపైఁ దనకుఁ గల్గు
పక్షపాతంబుచేఁ బక్షపాత మొంది. ౩౧

గ. దశకంఠుం డంత వేఁటురథంబుపై సీత నిడుకొని పోవుచుండ నా
జనకభూపాలపుత్రి సుగ్రీవాధీనం బైన దశగ్రీవప్రతాపానలంబుం
బోలె వాలినాశపిశునం బగు మహోల్కాపాతంబువగిది రామునకు
సాహాయ్య మొనర్పం బుత్త్రిని బ్రోత్సహింప నవని కవతరించిన

పతంగబింబం బన వెలింగెడినిజాభరణజాలంబుఁ జీరచెఱంగున మూట గట్టి శృంగసంగతపంచప్లవంగమై పంచచూడుఁ డగు క్ష్మాధరకుమారుంబోలు నొక్క క్ష్మాధరంబుపైఁ బడవైచె. ఆ పాపాత్ముండు తనపాటునుంబోలె నామూటపాటును బాటింపక చని మైథిలిని లంకాలంకారం బగు నశోకవనముం జేర్చె.

గీ. అసురకాంతలు తనచుట్టు నలమికొనఁగ
జనకరాజపుత్త్రి యశోకవనముఁ జేరె
నాంజనేయుని వాలంపుటగ్గిచేత
మండకుండఁగ రక్షించు మం దనంగ. ౩౨

శా. పాపానీకముఁ ద్రుంచురామధరణీపాలుండు లంకేశ్వరా
జ్ఞాపాశావృతవాటికేయమృగముల్ శార్దూలవిక్రీడితం
బేపారం దునుమాడి లక్ష్మణుఁడు దా వృత్తాంతముల్ దెల్పఁగా
భూపుత్త్రిం గనఁ బర్ణశాల కరిగెన్ బొంగారునుత్కంఠతోన్. ౩౩

—♦ సీతను గానక రాముఁడు విలపించుట ♦—

గీ. ఏమి యయ్యెడునో కద యీతఁ డింక
ననుచు వనదేవత ల్సాస్ర లోచుఁ జూడ
నుటజమందున సీత లేకుంట చూచి
తద్ద విలపించె. రాముండు తాల్మి దూలి. ౩౪

ఉ. అక్కట సీత లేదిచట హా యెటు లేగెనొ యేమి యయ్యెనో
యిక్కడఁ గాన నా నివిగొ యింతిపదాంకము లల్లలేడిఁ దే
కొక్కఁడ నేను రాఁ గినుక సూఁ నభంగి ముహూర్తమాత్ర మీ
చిక్కనిచెట్లచాటునను జేడియ డాఁగె నటంచు నెంచెదన్. ౩౫

ఉ. మానక నీదుకోర్కులు సమగ్రముగా నెఱవేర్చుచుంట కేఁ
బూనికతోడ నుండఁ బరిపూర్ణసుధాకరబింబవక్త్ర నా
పై నిపు డిట్టు లీ వలుగఁ బాడియె వేళయె యిద్ది యక్కటా
జానకిఁ బాసి రాముఁ డొకజామును నైఁచి వసింప నేర్చునే. ౩౬

గీ. అరిదిహరిణంబుపై నీకు నాస్థయేని
నిందునం దున్నలేడినే నిపుడ తెత్తు

నద్రి నీయొద్ద నుండినయంతకాల
మఱి యింక నీకొఱకు సౌఖ్యంబు నందుచుండు. ౩౭

గీ. బ్రదికియున్నచో సీత కష్టపడకయున్నె
క్రూరమృగములు చంపిన రుధిర మెద్ది
పోదు రాముండు లేకుండఁ బులినములకు
రక్కసులు మ్రింగియుందురు నిక్కముగను. ౩౮

మ. పరలోకంబున నున్నమామకు నతుల్యభక్తి వచింపంగ నీ
వరిగం బోలును సాధ్వి తత్సమయమర్యాద న్విలంఘించి య
న్నరనాథోత్తమునితోడఁ జెప్పి యటకు న్బొప్పింపు నన్నున్ న్నవోడిన్
భరతుం బట్టము గట్టెడు న్భువికి నీప్రాజ్ఞుండు సౌమిత్రియున్. ౩౯

క. అని విలపించుచు,

శా. ఎట్టున్ జానకిఁ గానలేమి ధృతి యెంతేఁ దూలి కంఠంబు నీ
ర్వట్టుం జెందఁగఁ దద్ద యేడ్చె రఘువరాముండు సౌమిత్రియుం
గట్టా! యట్టివిలాపము న్నరవిగాఁ గంఠోక్తి వర్ణించె నా
పుట్టంబుట్టినవాని యాతనిమనంబుం బోల్పఁ దా నెట్టిదో. ౪౦

—♦ సీతావృత్తాంతము జటాయువు రామున కెఱిఁగించుట ♦—

క. ఈరీతిగ విలపించుచు నిటు నటు వైదేహిని వెదకుచున్న దాశరథుం గని జటాయువు రామునితో "ఆయుష్మంతుఁడా! రావణుండు ఱెక్కలు నఱికి నన్నుం గూల నేసి జానకిం గొనిపోయె.

చ. అనుచు వచించి తత్క్షణము యాపతగేంద్రుఁడు వీతజీవుఁడై
మును శరభంగనామమునిముఖ్యుఁడు పోయినదారిఁ దానుఁ బో
యె నలరఘూద్వహుండు రచియించెను వానికిఁ దండ్రికైనఁదా
నొనరుపలేని బాష్పభరయుక్తజలాంజలి తర్పణంబులన్. ౪౧

—♦ కబంధవధ ♦—

క. దాశరథు లంత దక్షిణారణ్యమార్గంబునం బోవుచుండ నయోముఖి యనునొక్కరక్కసి కామాంధయై సౌమిత్రిని బాధింప నతండు దానిన్ శూర్పణఖం జేసినట్లు చేసె. అచ్చటనుండి క్రౌంచారణ్యంబుదారిని బోవుచుండ వారిని స్థూలశిరస్కుం డనుముని

శాపంబున నిశాచరత్వంబు గాంచినకబంధుం డనుయథార్థనాముం డొక్కరుండు ఫణిపతిభోగభీషణంబు లగుబాహువులచే బంధింప వారాచేతుల నరఁటిదూటలంబోలెఁ గత్తులతో నఱికివైచిరి.

చ. దనుజుఁడు వేఁడ భీమ మగుతత్తనువుల్ దహనంబుచేసి రా
యినకులరత్నదీపము లహీనకృపన్ గిరిగహ్వరంబునన్
ఘనతరశాపమోక్షణమున న్ముద మొంది సురారి పల్కె నీ
వినసుతుమైత్రిచేఁ బడసె దింతిని వెండియు నంచు రామునోన్. ౮౦

గ. స్వర్గంబున కేగుచు నాదుర్గతుం డుపదేశించిన మార్గంబును బట్టి ఋశ్యమూకంబున కరుగుచుం జని చని మతంగాశ్రమమందు శబరి యొసంగినసపర్యలం బరిగ్రహించి తదనుజ్ఞచే సౌమిత్రిసమేతుండై రాముండు మనోజ్ఞవివిధవిహంగకూజితంబును మృగగణవిహారణమనోహరంబు నగువనముం బ్రవేశించి విచ్చినతామరలం దాఁకి తావిగొని వనదేవతలలతాడోలల నూఁచుచుఁ గూలంబున లీలాపరవశంబులై విహరించుమత్తగజంబుల మదాంబువుం బీల్చి యొడ్డున నున్నతియ్యమామిడిగున్నల పూగుత్తులనుండి కాఱుతేనెతుంపరలం దలఁదాల్చి తీవియ లనునాటకత్రియల కాటనేర్పుచు లతాసదనంబుల మదనకదనకేళితత్పరలై విహరించుచెంచుగుబ్బెతలకొప్పులనుండి జాఱుమల్లిపూలతావిచే బరువెక్కి మల్లికాక్షపక్షక్షోభంబుచే బయలుదేఱుచున్ననీటితుంపురుల బత్తెంబుగాఁగొని తటవనంబునం బ్రసరించుపవనంబున కుల్లంబు తల్లడిల్లి మెల్లమెల్లనఁ బంపాసరోవరంబు తీరంబు చేరె.

ఇది శ్రీమత్కౌశికగోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకరసుధాకర రామయ నామధేయ
ప్రణీతాంధ్ర చంపూరామాయణంబు
నందు అరణ్యకాండము సంపూర్ణము.

# కిష్కింధాకాండము.



గీ. సాధుహృదయంబుపోలెఁ బ్రసన్నమైన
పంపఁ గని వియోగజ్వరకంపితుఁ డయి
సకలలోకనివేశిత ప్రకటసత్య
కర్త రఘుకులాధీశ్వరుం డార్తిఁ జెంది. ౧

వ. అంత నిరంతరతరుషండ మండితం బగు తటవనంబున నిభృతేతరభ్రమణ పరభృతవ్రాతచంచూమయవిపంచీ సముదంచిత పంచమాంచితంబును సంతతాకుంచిత పంచశరశరాసన శరాసార వంచిత పథికజనసంచార ప్రపంచంబును, బ్రమదభరభరితచంచరీకకులకంచుకితమాధవియు నగు మాధవీవిభూతి విజృంభించె.

క. పురుషులఁ గూడి రమించెడు
సరసీజాయతనయనల చక్కనితనువుల్
విరహిణు లగువారిమనము
లరుదుగ నవ్వేళ నూఁగులాడుచు నుండెన్. ౨

క. సుమసాయకు నుద్ధతికిన్
సమయం బగునట్టివేళ శయములచేతన్
సుమసంచయమున్ జూడ్కులఁ
గమనులమనముల్ తిగిచిరి కంజదళాక్షుల్. 3

వ. అసమశరసమరసమయం బగునవ్వేళ హృదయేశ్వరి హృదయంబునం బొడకట్టఁ దరణికులచంద్రుండు తమ్మునితో నిట్లనియె.

గీ. ఆధి నౌషధి, కేళి వయస్య, యజన
సమయమునఁ బత్ని, రణమున క్షత్రియాణి
యార్తి బంధువు, గుర్వర్చయందు శిష్య
యైనవైదేహి కానలోఁ గానరాదు. ౪

చ. మఱుఁ డనుమావటీఁడు తఱుమం బథికావళిఁ దాఁకి బాధలం
బఱపెడు సహ్యశైలభవమారుతమత్తగజంబు శైత్యస
త్పరిమళగాఢమాంద్య బలవత్త్రివిధాత్మక దానజుష్టమై
జరిపెడు వప్రకేళి యనిశంబు మదీయమానంబునం గటా. ౫

క. ఈగతి దుస్సహం బగువియోగానలంబున డెందంబు గంద నూర్మిళావిభు నూఱడింపుం బలుకులచే నించుక ధైర్యమూని యున్న యారాముం గని వాలి పంపినచారుం డని తలంచి సుగ్రీవుండు దూరంబుగాఁ బోయి మంత్రులతో మంతనం బుండి యాతనియాశయం బెఱింగి రా నాంజనేయు నంపె,

—♦ ఆంజనేయుఁడు సన్యాసివేషముతో దాశరథుల యొద్దకు వచ్చుట. ♦—

గీ. పుట్టువున వాయుపుత్రుండు భూరివిద్య
నర్కపుత్రుండు శక్రదత్తాంకుఁడు దశ
కంఠకీర్తిందుచరమపక్షస్వరూపుఁ
డాంజనేయుండు రాఘవు నపుడు గదిసె. ౬

క. సన్న్యాసివేష మూని ప్రభంజనపుత్త్రుం డట దాశరథులం జేరి యి ట్లనియె.

"సుందరాకారు లగుమీర లెవ్వరు? కాంతారంబున నిటు సంచరించుటకుం గారణం బేమి? మీరు చిత్రతరజిష్ణుకోదండమండితు లయ్యు నిది దుర్దినంబు గాకుంటచే జీమూతంబులు గా రనియు జటావల్కలధారు లయ్యు జంగము లగుటచేఁ గల్పవృక్షంబులు గా రనియుఁ దమోహరు లయ్యు నిరువురు నేకకాలమందె ప్రకాశించుచుండుటచేఁ బుష్పవంతులు గా రనియు నెంచెద.

గీ. సంయమాకల్పులైన మీచక్కఁదనము
తనరుఁ గుశసముద్భూతమా తావి పగిదిఁ
జెవులు మీవార్త యనుసుధచేతఁ గన్న
తనివి నాజిహ్వ తానును గనఁగఁ గోరు. ౭

క. అన్న కోడి ఋశ్యమూకంబు నాశ్రయించుకొని యున్న సుగ్రీవుం డనువానరపతి మీతో సఖ్యంబు చేసికొనం గోరి పంప భిక్షువే

పంబు ధరించి నే నిటకు వచ్చినాఁడ. నాపేరు హనుమంతుఁడు ప్రభంజనువలన నంజన యందు జన్మించినవాఁడ"

అని పలుక న ప్రశ్నోపయానంబు లగు నాపలుకులు విని హనుమంతుఁ గౌఁగిలించుకొని యాతని వెంట నేగి తరణికులతిలకుండు తరణితనయుతో సకలభువనసౌఖ్యకరం బగుసఖ్యం బొనర్చె.

—♦ రాముఁడు సుగ్రీవునితో సఖ్యం బొనర్చుట ♦—

గీ. పరఁగ వైవస్వతుఁడు సమవర్తియు నగు
హరిని రాముతోఁ గూర్పఁగా హనుమ దలఁపఁ
బరఁగ వైవస్వతుఁడు సమవర్తియు నగు
హరిని వాలితోఁ గూర్ప నియతి దలంచె. ౮

గ. సఖ్యం బొదవినంతన యన్యోన్యవిస్రంభం బుదయింప వాలిని దప్పక కూలెదనని రాముండు ప్రతినసేసె. సుగ్రీవుండును దశగ్రీవుండు తీసికొనిపోవుచుండ జనకతనయ క్రిందఁబడవైచిన యాభరణంబుల వియోగవ్యథాయథితహృదయుం డగు మైథిలీనాథున కర్పించె.

గీ. కపికులేశ్వరుఁ డిచ్చిన కాంత భూష
ణంబు లెల్ల సంస్కారహీనంబు లగుచు
మాసియుండుట గాంచి యమ్మనుకులుండు
కంటినీటిచే వానిని గడిగె నపుడు.

గ. సౌమిత్రియుపలాలనవాక్యంబుల నించుక ధైర్యం బవలంబించి రాముండు వాలివైరకారణం బే మని యడుగ భానుసూనుం డిట్లని చెప్పం దొడంగె.

—♦ వాలి సుగ్రీవుల వైర కారణము ♦—

"తొల్లి దుందుభియన్న మాయావి యనురాక్షసుండు నిఖిలరిపుకులతిమిరనిచయమరీచిమాలి యగువాలితోఁ బోరి యోడి పాతాళగుహలోఁ జొచ్చె. వాలియు వానిం బట్ట నాకుహరంబుం బ్రవేశించుచుఁ దద్ద్వారంబు కాచియుండ నన్ను నియోగించె. వాలి

ప్రత్యాగమనంబునకై యెదురుచూచుచు నే నచటఁ జిరకాలం బుండ నొకప్పు డాకందరంబునుండి ఫేనమాంసమిశ్రితం బగు నసృక్పూరంబు వెలు వెడల నాయన్న చచ్చె నని భావించి యతనికి నివాపం బొసంగి గుహాముఖంబునకుం బెద్దరాయి యొకటి దాపి శోకాంధుండనై కిష్కింధకుం జేర మంత్రు లందఱుం గూడి నాకుఁ బట్టంబు గట్టిరి. అంత వాలి యామాయావిని జంపి బిలంబునకు నే నడ్డపెట్టినరాతిని భుజబలంబు చేఁ దప్పించికొని నగరంబునకు వచ్చి యతిరోషావిష్టుండై యథార్థముం జెప్పి నే నెంత వేఁడికొన్నను నామాట సరకుసేయక నగరంబునుండి నన్ను వెడలం గొట్టుడుఁ బాఱి వచ్చి నే నీపర్వతమునం దప్పటినుండి నిర్భయుం బుగా నున్నవాఁడ. పూర్వమందు లులాయకాయుం డగుదుందుభి వాలితోఁ బోరి నిహతి నొంద వాలి వానికళేబరంబు బలావలేపంబునఁ దూలంబుపగిది నెత్తి విసర నది యీ మతంగాశ్రమంబునం బడియె.

గీ. వాలి యారీతి జిమ్మిన కూళదనుజు
తనువునుండి వెడలిన రక్తంబుచేత
నవ్వనంబును వాఁడి యానలుక చే ము
నీశువదనంబు నెంతయు నెఱ్ఱవారె. ౧౦

క. వృద్ధుం డగునమ్మతంగముని యొసంగినశాపబలంబున వాలి యిటకు రా ననువుగమి యెఱింగి పురనివాససౌఖ్యంబుల మఱచి నీఋశ్యమూకపర్వతం బాశ్రయించి యున్నవాఁడ.

గీ. దేవ నిను శత్రు వని యెంచి తేజ ముడిగి
యున్ననా కితం డానంద మొదవఁ జేసె
నంబుదముఁ గాంచి దవధూమ మని తలంచి
సోలునెమలికిఁ జలినీటిగాలి వోలె. ౧౧

క. అని సుగ్రీవుండు పలుక నమ్మాటలు విని రాముం డాతనితో క్షిప్రంబుగా నే నావలీముఖుని యసువుల నాశిలీముఖంబునం బాపెద నని ప్రతినచేసి తత్ప్రత్యయార్థంబు దుందుభికళేబరం బం

గుహ్యంబుచేఁ జిమ్మె. అట్లు చిమ్మినను నమ్మకము లేక యాభాను సూనుండు ప్రార్థింప సప్తభువనస్తంభాకృతి నున్న సప్తసాలంబుల లక్షించి యవిధేయయాతుధానకులవధవిధాయకం బగుసాయకం బుం బ్రయోగింప నది యావృక్షంబులఁ దత్క్షణంబ నతికి నికటం బున నున్నగిరితటంబులం గూడఁ బగులఁగొట్టె.

గీ. సాలకటక మే నతికినలీల నీవు
పంక్తిముఖసాలకటకంబు పగులఁ గొట్టు
మనుచుఁ గపివీరుతో రాముసమ్ము పలికె
రాయిఁ దాఁ దాఁకఁ బుట్టినరవముచేత. ౧౨

—♦ వాలివధము ♦—

గ. వృక్షచ్ఛేదకారణంబున సముత్పన్నం బైనప్రత్యయంబుచే నిన తనయుం డింద్రతనయుం గయ్యంబునకుఁ బిలువ వారల కప్పుడు ఘోరం బగుముష్టియుద్ధం బయ్యె. నిర్విశేషరూపకర్ము లగు వా రిరువురలో భేదం బరయం జాలక యాకృతిచే సుజనదుర్జనభేదం బుం గానలేక సభలో మౌన మూని యున్నవాగ్మివిధంబున రాముండు బాణంబుం బ్రయోగింపకుండె. వాలిబలంబున కోడి భానుసూనుండు వదాన్యుండై వడి మార్గణాగమనంబుం బ్రతీక్షించి తదభావంబున ధృతి దూలి దైన్యం బొంది పాఱిపోయె. విషణ్ణ హృదయుండై పలుకు లుడిగి కూలఁబడి యున్నయంశుమాలి పుత్త్రుం గని త్రైలోక్యైకధన్వియు సదయుండు నగు నామైథిలీ హృదయేశుం డాతనిమెడలో బాణనివారణసిద్ధౌషధంబు నా నొప్పు నొక్కమాల వైచి యిప్పుడు పోయి తిరుగ వానిని యుద్ధం బున కాహ్వానింపు మని యాజ్ఞాపించె. సుగ్రీవుండు నట్లొనర్ప వాలి తారహితవాక్యంబులం బాటింపక నియతి నతిక్రమింపం జాలక జలధరంబు పోలిక గర్జించుచు వచ్చి తమ్మునితోఁ బోరి దాశరథినిశితతరశరశకలితవక్షుండై నేలం గూలె.

పతి నిహతుం డగుట విని కన్నీరు మున్నీరుగాఁ గాఱుచుండఁ దార నగరంబు వెల్వడి వచ్చి కట్టిపెట్టినమత్తగజంబుంబోలె సుగ్రీ

వుండు నిర్భయంబుగఁ జూచుచుండ నేలం గూలి యుండియు మెడ యెత్తుకొని రక్త మొడ లెల్లడ స్రవించుచుండ శరాసన శిఖరన్యస్తహస్తుం డగు కాకుత్స్థుతో సల్లాపంబు చేయుచు నాడం బరవిహీనం బగునంబుధివగిది సస్తోన్ముఖుం డగుమయూఖమాలి లీల నున్న వాలిం జూచి కౌఁగిలించికొని తచ్ఛిరంబు నంకతలంబు నం దిడికొని రాఘవుతో ని ట్లనియె.

—♦ తా రా వి లా ప ము ♦—

గీ. చంద్రు శైత్యంబుపోలికి శ్రమహరంబు
సహజమును నైన భవదీయమహితకరుణ
నెట్లు విడిచితో మత్పాపహేతువునను
రఘుకులాధీశ చెపుము యోరమ్యకీర్తి. ౧౩

గీ. ప్రియుఁడు పోయినఁ బ్రాణము ల్వీడువకున్న
దనుజ నని నన్ను నిప్పుడు దునుము మయ్య
తాటకారాతి న న్నిట్లు దయ తుతోడఁ
జేర్పుపుణ్యంబుచే నీకు శ్రేయ మొదవు. ౧౪

గీ. నృపుల కిల వేఁట సామాన్యవృత్తి యనుచు
సభను నీవె చెప్పితి కాదె సత్యవాది
వనచరిని నన్నుఁ జంపుము బాణ మేసి
మృగులఁ గరుణించు మృగయుండు జగతి గలఁడె. ౧౫

ఆ.వె. ఇతని కోడి నీకు హితుఁడై యితఁడు ఋశ్య
మూకమదు భయము లేకయున్న
క్రియ మదీయహృదయగిరిదుర్గమందు నా
భర్తయున్నవాఁడు పదిలముగను. ౧౬

ఉ. కాను సుకేతుకూఁతురను గాను వనస్థలి సప్తసాలియుగ్మా
మానితసత్త్వుఁడైనశతమన్యుసుతుండను గాను వజ్రముం
బోని కఠోరచిత్తమును బూనిన తారను గాని నేను నీ
వీనను జంపకే జనకజేశ్వర ధన్విని యెట్టు లయ్యెదో. ౧౭

చ. ధర సిరితోఁ జనించు వసుధావరసూనుల కెల్ల సాజమై
పరఁగఁగ నోపు మాగ్ధ్యము నపారపరాక్రమ మట్లు కానిచోఁ
వరుఁ డిదె నాసనంబున శుభస్థితి నుండఁగ నీవు వానికై
కరమునఁ జాపమూని యిటు కాచుకయుండఁగ నేలరాఘవా. ౧౮

గ. తార పరిదేవనరవంబు చేతను దబ్బాష్పాంబుశిశిరం బగునక్షీణని శ్వాసానిలసంపర్కంబునను సేదదేఱినరీతి లబ్ధసంజ్ఞుండై నందను నంగదు రఘునందనున కొప్పగించి తన కంఠంబున నున్న కాంచనమాలను శోకావనతగ్రీవుం డగు సుగ్రీవుమెడలోఁ వైచి నిజభుజబలప్రశాంతాసురుం డగునవ్వాలి ప్రశాంతాసుం డయ్యె. వానరులాకళేబరంబుం జేరి "హా వాలీ! సకలభువనబహుమతబాహుబలశాలి! గోలభగంధర్వగంధసింధురపంచతాకరణపంచాననుండవు, దశముఖభుజభుజంగభోగనిరోధాహితుండికాయితవాలవలయుండవు నగు నీకీదురవస్థ తుద కబ్బెనే" యని విలపించుచు రామునాజ్ఞ యథావిధిగాఁ బ్రేతకృత్యం బొనర్చిరి. జాంబవత్ప్రముఖులా వెనుక నినకులాధీశుని దేశంబున సుగ్రీవునిఁ గాంచనకలశోదకంబుల నభిషిక్తుం గావించిరి.

గీ. రామనీలపయోదంబు రాజ్యమునకుఁ
జెలిని సుగ్రీవు నభిషిక్తుఁ జేసి నపుడు
పుడమి నభిషిక్తఁ జేయఁగాఁ బూనె మేఘ
మాల కడఁకతోడుత రాజమహిషిఁ బోలె. ౧౯

ఆ. వె. ఆర్య వెదకఁ బంప నవసరం బగు దాఁక
మీరు నాపురంబు చేరియుండ
వలయు నన్నయినజు ప్రార్థనంబు భరతు
ప్రార్థనంబువగిది వ్యర్థమయ్యె. ౨౦

—* వర్షాకాల విలాసము. *—

గీ. అర్జునవికాసకరణ సహాయకంబు
ధార్తరాష్ట్రనిరసనవిధాయకంబు

నగుచు దేవకీనందను ననుకరించె
సాంద్రజీమూతసంఘాతసమయ మపుడు. ౨౧

చ. తనురుచిచే నితండు మముఁ దద్దయు ధిక్కృతి చేసి యంతతోఁ
దనియక మాపిభు న్బలవిదారిని గూడ నిరాకరించి త
త్తనయుని జంపె నంచుఁ బగఁ దాలిచె నా జలదాళి గ్రమ్మ గ
ర్జన మొనరించుచుఁ దిశల రాఘవునాహవకార్య మడ్డుచున్. ౨౨

గీ. శమితతాపంబు నంచితసత్పథంబు
నుపచితోరుజీవనధార మూర్జితంబు
నైనమేఘాళి భూపాళియట్లు మిగులఁ
గలఁగెఁ బౌరస్త్యుఁడౌ మహాబలునివలన. ౨౩

గ. వర్షాకాలవికాసంబు నతిశయించె. పాకశాసనశరాసనంబునందలి చిత్రవర్ణంబులు నక్షత్రమార్గం బావరించె. మేఘగర్జనంబులచే దిక్కులు పిక్కటిల్లె. కదంబవనంబుల వెలువడిననాలిగాలిసోఁకునఁ గాదంబకదంబంబుడంబు డిందె. అంబుధరంబు లంబరం బెల్లెడ నల్లుకొనియె. శిలీంధ్రంబులచే వసుంధర బంధురం బయ్యె. మిక్కుటంబుగా వికసించినకుటజంబు లటవికి మైమఱువు తెఱంగున మెఱయుచుండె. అవ్వానకారుతీరుం జూచి ప్రవృద్ధమన్యుండై మనుకులాధీశుండు సౌమిత్రితో ని ట్లనియె.

—♦ రాముని విరహవేదన ♦—

శా. నీలగ్రీవగళాభమై నెగడు నీనీరంధ్రమేఘాళి తా
వాలాయమ్మును యౌవనోద్ధతజనస్వాంతంబులన్ వేఁపెడుం
జాల న్వీచెడువారిధారలజడిన్ శైత్యంబు సంధిల్ల నా
భీలం బౌపవనం బహో విరహము న్వేఁ దాఁటు టెట్లో గదే! ౨౪

మ. స్మరసంయత్ప్రసనోగ్రశాహాళచయస్వానాకృతిన్ దిక్కులన్
బరపెన్ గేకులు భూరినాదము ఘనవ్యాప్తిన్ నితాంతంబు దు
ర్భరమై యొప్పెడి యిట్టివేళ విరహప్రాగ్భార*సంతాపవుం
భరమున్ సైఁచెడువార లేరియనుచున్ వాపోవుచందంబునన్. ౨౫

---

* పాఠాంతరము........సంతాపసాగర మీఁదం గలపూరుషుల్ నతులు కే,శా” యన్న చందంబునన్.

చ. ఉన్నతరసాంద్రనీలజలదోదరనిర్గతవారిధారల
న్నెఱవడిఁ దాఁకి వీచెడుసమిద్ధమహాబలుఁ డేచి చిమ్మఁగాఁ
బరిమళవీచికానిచయభారవహాత్కుటజప్రసూనముల్
తెఱపి యొకింతయేనియును లేక నభం బిదె క్రమ్మెఁ జూచితే. ౨౬

గీ. ఘనవినీలపత్త్రమయినగగనవటము
నుండి జాఱు నుదకధార లూడలట్లు;
తీరతరుపుష్పయుతము లా నేలలందు
నంతకంతకు జలపూర మతిశయిల్లె. ౨౭

గీ. జలధిలోనుండి జలదాళి జలముతోడ
నౌర్వశిఖిశిఖాజాలంబు నట్టె పీల్చి
కడుపులో నద్ది తద్దయు నుడుకు సేయఁ
గ్రక్కుచున్నది విద్యుదాకారమునను. ౨౮

వ. అట్టి వర్షాకాలంబు రాముం డెట్టులో గడపె నంత నాతనితను కాంత ననుకరించెనో యన మేఘమండలంబు పాండురం బయ్యె. అద్ది రామశరాసనవ్యాపారంబున కవసరం బగుటం జేసి పాకశాసనశరాసనం బంతర్హితం బయ్యె.

గీ. జానకీపతిజ్యాఘోషసమయ మిద్ది
యనుచు నుద్భటఘనఘటాస్తనిత ముడిగె
నతనిశ్వసనంబునకు నోడి యఖిలకుసుమ
గంధవహుఁ డైనపవనుండు గాసిఁ జెందె. ౨౯

గీ. ఉష్ణశమనంబు నటియించి యుర్విఁ దనిపి
వృష్టినటి నభోరంగంబు విడిచి చనియె
జలదవాద్యంబు శాంతించె సర్వ మపుడ
యాఱెను మెఱుంగుదీపంబు లాక్షణంబ. 30

వ. భావివానరవాహినీపూర్తికి నులికి యో యన వాహినీజాతంబు క్రమక్రమంబుగా క్షీణించె. దుర్దినావసానం బగుడు లంకయందును రాజహంస నిశ్శంకసంచారంబు కలుగు ననికాఁ బోలు రాజహంస నిశ్శంకసంచారం బవనియందుఁ బ్రవర్తిల్లె. విరహిజనధైర్యహరం బగువర్షర్తు వీగతి గతింప,

—* లక్ష్మణుఁడు కిష్కింధ కేగుట *—

చ. అసమశరేషుభిన్నహృదయస్థితరంధ్రము వెంట నెయ్యపు
రసము దొరంగ నాశ్రుతభరంబు భరింప నశక్తుఁడై వసూ
ర్యసుతు మనోజమాఢ్య మపహాస్య మొనర్ప మహోగ్రకోపుఁడై
వెసఁ జనుదెంచె లక్ష్మణుఁడు విప్లుతధైర్యుఁడు రాముఁ డంపఁగన్.

గ. లక్ష్మణుండు మిగుల రోషావిష్టుండై చనుదెంచె నని యంగదుండు తెలిపినను రతిపరిశ్రమముచే మేల్కననిసుగ్రీవుండు రామానుజదర్శనమాత్రంబున భయకంపితు లైన ప్లవగుల కిలకిలశబ్దంబులం దెలివివచ్చి ప్లక్షప్రభావనాము లగు సచివుల యనునయంపువాక్యంబులఁ జిత్తంబు కుదురుపఱుచుకొని రాఘవరోషకారణం బేమై యుండు నని యోజించుచుండ లక్ష్మణునిజ్యాఘోషంబు ముఖరితదిఙ్ముఖంబయ్యె.

చ. వనచరయూథనాయకుఁ డవారితభూరిశరాసఘోషము
న్విని పటుతాపవారకనవీనపయోధరగర్జ మాలకిం
చినభుజగంబులీల ధృతి చేడ్పడి చిత్తము తత్తఱిల్ల నా
సనము తటాలున న్విడిచి చయ్యన లేచె మొఁగంబు వాల్చుచున్.

గ. కుపితుండైన యన్నగారు పంపఁ బ్రతిశ్రుతకార్య మొనర్ప నిన్నుఁ బ్రోత్సహింప సౌమిత్రి వచ్చె నని హనూమంతుండు దెల్ప నించుక ధైర్య మూని యూర్మిళాకాంతు శాంతుం జేయఁ దారాకాంత నియోగించె.

గీ. వారుణీయోగగతరాజవైభవంబు
విగతతమము నిర్గతతార మగుచు సత్ప
థస్థమిత్రుండు పూర్వాశఁ దారసిల్ల
నర్కజునిశాంత మపుడు నిశాంత మయ్యె. 33

గ. తార యారఘువీరుతో నిట్లనియె.

చ. సురపతి సూనుజాత మగుశోకము మాన్పెను దొల్లి సాలముల్
నఱకిన రాముసాయకము నాపతి కప్పు, డుపేంద్రసూనుఁ డా

మరునిశరంబులం బొడమె మానని పెన్వ్యసనంబు దాని నీ
వరుదుగఁ బాపినాఁడవు శరాసనఘోషముచేత లక్ష్మణా. ౩౭

క. అమ్మాటల సౌమిత్రికోపం బుడుగ నాతనివెంట సుగ్రీవుండు సవినయంబుగా రాముపాలికిం జని మ్రొక్కి "దేవ! సకలకులాచలంబుల నుండు కపిబలంబు నెల్ల ననిలతనయుం డొక్కచో సమకూర్చె- పులోమజాపహారి యగునహుషు నింద్రుండుపోలె రావణుని నీవు తప్పక పరిమార్చెద"వని పలికి.

—* సీతను వెదక సుగ్రీవుఁడు వానరులఁ బంపుట *—

గీ. వినతుఁ దూర్పునకుఁ బవనతనయు దండ
ధరునివైపునకు సుషేణు వరుణదిశకు
ధనదునాశకు శతవలి యనెడువాని
వానరేంద్రుఁ డనిపె రాముపనిత వెదక. ౩౮

క. పూర్వపశ్చిమోత్తరదిశల కేగిన వానరబలంబులు తిరిగి తిరిగి జానకిం గానక గడువు దాఁటినం జండశాసనుం డగు సుగ్రీవుండు దండించు ననుభయంబున మరలి వచ్చిరి. మారుతి జాంబవదంగద నీలాధిష్ఠితంబై దక్షిణపుదిక్కున కేగినయక్కపిసేన సుతుమరణంబుకతంబున నతికుపితుండైన కండుముని శాపమూలంబున నిర్మూలితచరాచరజాలం బగుదుర్గమారణ్యంబు మార్గంబునం జని యొక్క కాంతారంబున నిశాచరు నొక్కనిం గాంచి రావణుం డనుబుద్ధిచే యుద్ధసన్నద్ధులైరి.

గీ. నిశిచరాధిపుఁ డని మది నిశ్చయించి
పిడుగులను బోలు గుద్దులఁ బొడిచి పొడిచి
యసురహితుఁ డైనయసురుని యసుఉవాపి
సురహిత మొనరించెను వాలిసూనుఁ డప్పుడు. ౩౯

క. పదపడి యవ్వానరులు దప్పిచేఁ గడుం డస్సి నీటికై వెదకుచు జలచరపతంగంబుల పతనోత్పతనంబుల నచ్చట జలాశయం బుండనోపు నని యూహించి యొక్కకుహరంబు సొచ్చి యందు మయమాయానిర్మితం బైనయట్టియుఁ దపోధనతపోభంగకారి యగు హే

మానామసురాంగన కరవిందసంభవుం డొసంగినట్టియు మేరుసావర్ణితనూజ యగు స్వయంప్రభ కాపాడుచున్నట్టియుఁ గాంచనమయవనంబుం బ్రవేశించి స్వయంప్రభాదత్తాతిథ్యంబుం గొని తదంగనా ప్రభావంబున బిలంబు వెలువడి వచ్చి సమయాతిపాతం బగుడు సుగ్రీవుండు తప్పక దండించు ననుభయంబునం బ్రాయోపవిష్టులై యుండ నవ్వానరుల పరిదేవనకథాప్రసంగంబున జటాయువు విగతాయు వైనట్లెఱింగి వింధ్యకుహరంబు వెడలి వచ్చి సంపాతి యనుగృధ్రరాజు.

చ. కనలి మదీయపక్షములఁ గాలిచినట్టిమహోగ్రదీధితిం
దను పనిపింపఁ జాలినయుదగ్రదవాగ్నివిభీషణోక్తి నా
యనుజు మహాబలాన్వితు జటాయువు చావును దెల్పి నాచెవుల్
కనకన మండునట్లు కడు గాసి యొనర్చిన మీర లెవ్వరో. 32

—*సీత లంకయం దుండుట వానరులు సంపాతివలన నెఱుంగుట*—

గ. అని యడిగి వారలవలన వృత్తాంతం బంతేయు నెఱింగి ప్రోషితాయు వగుజటాయువునకు నివాపాంజలి యొసంగి తొల్లి తన తనయుం డగు సుపార్శ్వుం డాహారార్థం బై తిరుగుచు దానవాధీశుం డగొనిపోవుచుండ ధారణీతనయ విలపింప వింటి నని చెప్పినమాట మనంబున నాటికొని యుండుటచే నూత్నచక్షుం డగు నాపక్షిరాజు వారలతో "ఈయధైర్యం బేల? సీత యాతుధానరాజధాని యైనలంకయం దున్నది. మీర లటకుం జనుండు.

గీ. దినకరప్లోషజనితార్తిఁ దీర్చి వైచి
నాకు మీరాక దెలిపె నిశాకరాఖ్య
మునివరుం డద్రిధృతులార క్షణములోనఁ
గనియెదరుచుండు శ్రీరామకాంత మీరు". 33

ఁ. అనుచుఁ బలుకుసంపాతిఁ బరావరజ్ఞ
హితుని నెంతయు సంతుష్టహృదయులాచు
వీడుకొని భూమిజాతను వెదకుకోఱకుఁ
బృథుబలాఢ్యులౌ వానరు ల్వెడలి రపుడు. 34

ఆ. వె. వానరేంద్రునాజ్ఞ బత్తెంబుగాఁ గొని
యసురనాథుమార్గ మరయుపొంటె
హృష్టచిత్తు లగుచు నేగెడుకపులకు
నుదధి తోఁచెఁ గంటి కెదురు గాఁగ. ౪౦

ఆ. వె. వజ్రిసూను వైరి పటుశిలీముఖములఁ
బారహీన మైనవారిరాశిఁ
దలఁచి తలఁచి కపులు తలలు వ్రాలఁగ వైచి
పలుక కుండి రేమి పాలుపోక. ౪౧

గ. అప్పుడు వారలతో నంగదుం డిట్లు లనియె.

ఉ. "మానము నుజ్జగించి యిట మానము దాలిచి యుండ నేల నో
వానరులార! యీసగరపార్థివకల్పితపల్వలంబు నే
పూని తరింప లేనిమిముబోఁటు లిఁ కెట్టులు దాఁట నేర్తురో
ద్రోణజపీత మై చెడని దుర్యశ మన్నయపారవారిధిన్". ౪౨

గ. అంత వానరనాయకులు పారావారంబు దాఁటుటకుం దమకుం గలశక్తి నొక్కొక్కరే యుగ్గడించుచుండఁ బ్రభంజనపుత్త్రుం డగునాంజనేయు నుద్దేశించి జాంబవంతుం డిట్లు లనియె.

చ. "వనచరవీరులార! యిటు వ్యర్థముగా బలతారతమ్యము
ల్గణనలు సేయనేల మన కార్యము దుర్ఘట మాచునుండ నీ
యనిలసుతుండు భానుసుతునాజ్ఞ దలంచి తరింపఁ బూనిన
న్వనధికి గోష్పదంబునకు వార యొకింతయుఁ గల్గ నేర్చునే. ౪౩

ఆ. వె. బాల్యమం దితండు పం డనుభ్రాంతిచే
నుదయభాను బ్రింగఁ గదిసె నంత,
దాడమీఁదఁ గొట్టె దంభోళిచే వజ్రి
యజుఁడు వర మొసంగె ననిలుఁ డుబ్బ". ౪౪

గీ. తజ్జుఁ డౌ జాంబవంతుండు తనదుప్రజ్ఞ
యిట్లు తెలుపఁ ద్రివిక్రము నట్లు మేను

వెంచి గిరి యెక్కి తనవారి వీడుకొనుచు
నబ్ధి దాఁటంగ నుంకించె ననిలసుతుఁడు.

ఇది శ్రీమత్కౌశికగోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకరసుధాకర రామయ నామధేయ
ప్రణీతాంధ్ర చంపూరామాయణంబు
నందు కిష్కింధాకాండము సంపూర్ణము.



# సుందరకాండము



—: హనుమంతుఁడు సముద్రము దాఁటుట :—

గీ. చెలఁగి దశకంఠసీత యా సీత వెదక
మారుతి యలమహేంద్రాద్రిమస్తకంబు
నుండి బలిమిమై నుంకించి యుదధి దాఁట
గరుడవేగంబుతోఁ బాఱె ఖచరవీథి. ౧

క. ప్రభంజననందనుం డీగతి వనధి యుల్లంఘింప నుంకించి బలిమిమైఁ బాదతలంబులం దట్టింప నాఘట్టనంబుచే వనము మిగుల దుర వస్థం జెందె.

చ. అనిలజుఁ డేగువేగమున నాతని వెంబడిఁ బోయి వృక్షము
ల్వననిధి నచ్చటచ్చటను వ్రాలి మునింగియ యుండ నీటిపైఁ
గనఁబడు వానియగ్రములు కానఁగనయ్యెను సేతుమార్గసూ
చనముగ నాటినట్టి యల శంకులచాలొకొ నాఁగఁ బోల్పఁగన్. ౨

గీ. వీఁక శృంగము ల్నాకంబుఁ దాఁకుచుండఁ
బక్షహతిచేత క్షుభితమౌ వనధి వెడలి
వచ్చె నప్పుడు మైనాకపర్వతంబు
గాలిపట్టికి విశ్రాంతి గలుగఁజేయ. 3

క. ప్రయాణంబున కంతరాయంబు గలిగె నను బుద్ధి నాంజనేయుం డాక్ష్మాధరంబును వక్షంబుచేఁ దాఁకి క్రిందఁ బడవైచి పోవుచుం డ మైనాకుం డాతని కిట్లనియె.

ఆ. వె. "బాటశ్రమము నీకుఁ బాపఁ గృతజ్ఞుఁ డౌ
సాగరుండు పంపె సౌమ్య నన్ను
నట్లుగాన నంజనానందవర్ధన
కొంచె మిచట విశ్రమించి చనుము. ౪

ఆ. వె. వజ్రివలనిభయము వాపి నీజనకుండు
కాచెఁ దొల్లి నన్నుఁ గరుణతోడఁ

గనుక నే విపక్షుఁడను గాక యున్నాఁడ
నను సపక్షుఁగఁ గయికొనుము నీవు". ౫

వ. ఈగతిఁ బ్రార్థించిన యాహిరణ్యనాభుని సన్మానించి హనుమం
తుండు కార్యగతి నేగె.

క. మైనాకుం డటు లప్పుడు
కానంగఁబడినను వజ్రి గాసించుట తా
మానె నతని వాఁ డలపవ
మానాత్మజునకుఁ జలిపిన మన్ననచేతన్. ౬

వ. లంకాముఖంబుగ మారుతవేగంబునం బోవుచున్న యామారుతి
మార్గంబును సురసయనునురగమాత తరణిసరణిని వింధ్యాద్రిపోలె
నడ్డగింప.

ఆ. వె. పూని సురసఁ జంప మేను వెంచిన యట్టి
పవనపుత్త్రికాళ్లు వనధి నుండె
శిరము వేల్పుటేటి శీకరక్షోదంపు
టలరుదండ దాల్చి యలరుచుండె. ౭

ఆ. వె. ఆంజనేయుఁ డంత నంగంబు గుదియించి
సురసకడుపుఁ జొచ్చి తిరిగి వెడలి
మిన్నుముట్టునట్టు మెయి వెంచి యల్లత్రి
విక్రమావతారువిధము చూపె. ౮

గీ. అంత సింహికానామ ఛాయాస్వరూప
రాక్షసాంగన తన కడ్డు రాఁగ వాఁడి
మైనగోళ్లతో వేగంబు దానిఁ జీల్చి
వైచి నరహరికృత్యంబు వ్యక్తపఱిచె. ౯

వ. ఇట్లేగి పారావారంబు నవ్వలి తీరంబున నున్నలంబగిరియందు
బ్రాలి సూక్ష్మశరీరముం దాల్చి క్రమంబుగా లంకా పురోత్తర
గోపుర ద్వారంబుఁ జేరి మారుతి యిట్లని వితర్కింపఁ జొచ్చె. "వాన
రసేన యంతరాయంబుల నన్నింటిం దప్పించుకొని యతివితతంబగు
నీసముద్రంబు దాఁటు టెట్లు? దాఁటుంబో రాక్షస రాజధానిం జేరు

జెట్లు? ఎట్లుచూచినను దాశరథి విఫలమనోరథుం డగునట్లుతోఁచుచున్నది. నేనీపారావారంబును లంఘించుట యెంతయు వ్యర్థంబయ్యె. జానకి జీవించి యున్నదో లేదో? అది కూడఁ దెలియకున్నది". ఇట్లని విచారించుచు మారుతి ప్రచ్ఛన్నసంచారుండై సీతను వెదకుటకై సూర్యాస్తమయంబు నిరీక్షించియుండె నంత నగస్త్యుని యొద్ద దాఁచియుంచిన శతమఖధనుస్సునకుం బ్రయోజనసమయ మాసన్నమయ్యె నని వరుణునకుం దెలుపుటకో యన భగవంతుం డగు భాస్వంతుం డపరదిక్కుం జేరుటయుఁ బాడుపుగుబ్బలియుం దడవిలోఁ బెచ్చు పెరిఁగి మండుచున్న కార్చిచ్చుమంటలో కాక పతంగరశ్ములు తమ్ముఁ జుట్టి బిగియం బట్టఁ దపనోపలంబు లుమియుచున్న పావకజ్వాలాపటలమో యదియుం గాక యభ్యాగతుం డైనమిత్రున కర్ఘ్య మొసంగఁ బ్రాచేతసుం డంబుధిగర్భంబుననుండి తెచ్చినమాణిక్యకిరణంబులో మఱి యదియును గాక సురతరంగిణీసలిలంబు సైతము పీల్చుటకై విజృంభించి చరమసాగరగర్భంబు వెడలి వచ్చుచున్న యౌర్వాగ్నికీలలో యన సందేహంబున కాకరంబై సంధ్యారాగం బాకసంబు నలమె. సరసీరుహశ్రేణులు పత్త్రపుటకవాటపిధానంబు లగుటచే మకరందభిక్షార్థంబై మధువ్రతద్విజబృందంబు కుముదభవనంబుల కేగుచుండె. సాయంతనపవనంబు వికచకువలయసంపర్కంబున సురభిళం బయ్యె. చీఁకటి వ్యాపించుటచే దిక్పాలపుర గోపురంబులపైఁ గాలాగురుధూపంబు పర్వినట్లయ్యె. కమలాకరంబులం దెల్లెడల వియోగవేదనావిష్టంబులైన చక్రవాకంబుల యాక్రందనంబులు వినవయ్యె. గగనమాతంగంబు నక్షత్రమాలాలంకృతంబయ్యె. అత్తఱి.

—* హనుమంతుఁడు లంకాపురమందు సీతను వెదకుట *—

ఉ. భూరితరాంధకారరుచిపూరతమాలకుతారధార శృం
గారరసస్వరూప మనఁగా శశిమండల మంతఁ దోఁచె నా

తూరుపుగొండపైఁ దనుముతోఁ బెనఁగొన్న తదీయదీధితు
ల్మీఱెను నాచుతోఁ గలిసి మించు బిసాంకురసన్నిభంబులై. ౧౦

చ. అసురపురప్రవేశమహితాద్భుతనాటకసూత్రధారుఁడై
యసురకులేంద్రకీర్తినిచయప్రతిసీరఁ దొలంగఁద్రోచి తా
నసమముదంబు సర్వవిబుధావళికి న్సమకూడునట్లుగా
శ్వసనతనూభవుం డలసిశాముఖమందునఁ దోఁచె నచ్చటన్. ౧౧

వ. తదనంతరము యువతీరూపంబుఁ దాల్చి దారి కడ్డమై తన్నుఁ దర్జించెడు లంకాధిదేవతను నిర్జించి భవన్నిలయవిలయంబు వానరరచితావజ్ఞోపజ్ఞంబగునని తొల్లి సరసిజాసనుండు పలికె నని పలికి యాదేవత తన కనుమతి యొసంగుడు ననిలజుండు జనకజ న్వెదకుచు నవ్యాహతంబుగా సంచరించుచు నెట్టకేల కసురనాయకప్రాసాదంబుం జేర.

ఉ. రాక్షససైన్యగుప్తమగు రావణుపట్టన మిద్ది యిద్ది యా
రాక్షసభర్తసౌధము హిరణ్మయశృంగము పుష్పకం బిదే
యక్షవిభున్ జయించి కొనినట్టిది యంచు మరుత్తనూజుతో
నాక్షప చెప్పి చూపెఁ గుముదాప్తకరామలకాంతి వెల్గునన్. ౧౨

చ. తనయుఁడు రాఘవేంద్రునకుఁ దద్దయు సాయ మొనర్చుచుంటచే
నినుఁడు కృతార్థతం బొరయు నేను నపారయశోభరంబు చే
కొనియెదఁగాక యంచు మదిఁగోరి సుధాంశుఁడు రాముదూత పా
వని తెరు వెల్లచో వెలుఁగు పర్వఁగఁజేసెఁ బ్రదీపికాకృతిన్. ౧౩

వ. పవనపుత్రుండు పంక్తికంఠు భవనంబుం బ్రవేశించి నిద్రయందుఁ గూడ సౌందర్యంబున నస్వప్నసుందరుల మించి వేశ్యాయువతీజన పరివృతలై శయనించి యున్న యవరోధవధూజనంబుం జూచి జానకి నందుఁ గానక బహువిధచింతావశుండై యశోకవనంబున వెదకె ద నని యిష్టదేవతా ప్రణామం బొనర్చి ప్రాకారంబునుండి యెగిరి.

—* హనుమంతుఁడు అశోకవనము ప్రవేశించుట *—

గీ. ఎల్లెడల సీత నారసి యెట్టకేల
కనిలజుండు ఘనాశోకవనముఁ జేరె

నూర్ధ్వగతిఁ గోరు శమధనుం డొండుగతిని
వదలి వేదమార్గంబును బట్టినట్లు.

గ. చేరి వివిధతరునివహపరివృతం బైన యావనంబునం దెల్లెడలం దిరిగి తుదకు నభ్రంకషవిటపనిబిడితగగనప్రపంచం బగు నొకకాం చనమయశింశుపావృక్షంబుపై బ్రాఁకె.

క. తరుపత్త్రంబులచాటునఁ
బరులకుఁ గానంగరాక పవనజుఁ డుండెం
బరమాత్ముఁడు వటపత్త్రో
దరమునఁ బవళించువిధము దనరుచునుండన్. ౧౫

ఉ. మామిడితోఁట నున్న నవమల్లిక భిల్లుఁడు కంచెఁ బెట్టిన ట్లామిషబుద్ధిఁ గుక్క గుడియుండలిమాల శ్మశానవాటికా భూమినిఁ జేర్చిన ట్లసురపుంగవుఁ డాశ్రమభూమినుండి పే రామునఁ దెచ్చి యుంచిన నిరాభరణం గనె సీత నచ్చటన్. ౧౬

గ. కాంచి.

గీ. "వెన్నెలను వీడి చంద్రుండు వెలయుఁ గాక
ఛాయ లేకుండ నినుఁ డుండఁ జాలుఁగాక
యీమె నిట్టులు విడనాడి రాముఁ డెట్లు
ధీరుఁడై యుండఁ గల్గెనో తెలియరాదు". ౧౭

గ. అని వితర్కించుచు నారాత్రి యెట్టులో గడపె. రజనికరుండును జరమగిరిశిఖరోపకంఠసేవ్రోత్కంఠుం డయ్యె. అప్పుడు దశకంఠుం డు మేల్కని నిద్రచాలమిని మదనబాణప్రహారంబులను గన్ను లెఱ్ఱవార సరసహరిచందనచర్చచేతను జానకీసందర్శనోత్కంఠ చేతను రాగముం బ్రకటించుచు వైకక్షమాలచేతను బలె మకుట రత్నప్రభచేతను నక్షత్రమాలను దిరస్కరించుచు మెల్లమెల్లగా నశోకవనముం జేరె.

క. సురవైరి వారవనితల
కరముల వెలుఁగొందు దీపికానిచయారుచిం

బఱీవ్రాయినతమ మంతయు
సురరిపుహృదయంబునందు సూటిగఁ జొచ్చెన్. ౧౮

గీ. అట్లు మదమత్తుఁ డైనపాపాసురుండు
రాముసతిఁ జేరెఁ గేవలరామ యనుచుఁ
బల్లవిత సల్లకి యనెడు భ్రాంతివలనఁ
గరి సవనశిఖిశిఖఁ బట్టఁ గడఁగినట్లు. ౧౯

—: సీత రావణునకు హితోపదేశము చేయుట :—

క. దశకంఠుం జూచినమాత్రాన వడఁకుచు నాతనిదుష్ప్రలాపంబుల కున్ గుండె లవియ గడ్డిపరక నొకదాని నడ్డుగ నుంచి సీత యాతని కి ట్లనియె.

"ఓరీ! సకలసదాచారప్రతిష్ఠావిష్ఠుం డగుపరమేష్ఠివంశంబున జన్మించిన నీపరకళత్రాభిలాషరూపకదుష్ప్రవర్తనంబు కులము వారి కెల్ల సిగ్గు గావించునుగదా! దారితప్పి విపద్దశలో నున్ననావ ననుకూలవాయువు దరిఁ జేర్చినట్లు నీవు నన్నుఁ దిరిగి పంచవటీప రిసరంబుఁ జేర్చెదవేని నాజీవితేశుండును సాక్షాజ్జీవితేశుండును గూడ నిన్నుఁ దప్పక కరుణింతురు. అజయ్యుఁ డగుదాశరథిమైత్రికిఁ గూడ నీవు పాత్రుండ వగుదువు. అట్లొనరింపనిచో ఖరాదిరాక్షసబలంబును విలయంబు నొందించి నప్పు డార్యపుత్రుశిలీముఖముఖంబున దట్టంబుగా నంటుకొన్నక్రొవ్వున దనహృదయంబు నుండి కాఱురుధిరధారచేఁ గడిగి తొలంగించువాఁడు నీవు దక్క మఱి యెవ్వఁ డుండును? అదియునుం గాక జనస్థానసమరం బాది నేఁటివఱకు సమరంబు కఱవగుటచే దప్పిగొనియున్నసౌమిత్రి సాయకంబు లను చాతకంబులు నీరక్తమనుజలముం ద్రావకుండ వారించువాఁ డుండునె?" అని విరమించె.

గీ. సీతపలుకుల నొకఁడైనఁ జేరదయ్యెఁ
బంచశరభిన్న మైనరావణుని మదినిఁ
బంచవక్త్రహిదష్టుఁడౌ వాని కిందు
నొక్క మృత్యు వాసన్నమై యుండ దందు. ౨౦

వ. మైథిలీవాక్యంబులు చెవులకు ములుకులై తాఁక రోషపరాఙ్ముఖుం డై దశముఖుం డా పెం జుట్టుకొనియున్న రాక్షసాంగనలతో "మీ రీయువిదం జతురుపాయంబులచే నాకు వశ్యం జేయుఁడు అందున కనుకూలింపకున్నం బ్రాతరాశంబునకై మహానసంబునకుం దెం" డని యాజ్ఞాపించి యంత నిశాంతం బాసన్నం బగుడు నిజనిలయం బున కేగె. అంత శాపబలంబున మర్త్యలోకంబున జన్మించిన యనిమిషాంగనపగిది నున్నయాజనకనందన కర్కశలగు నారక్కసి మెలఁతల భీషణభాషణవీక్షణంబుల డెందంబు గంద వ్యాఘ్రంబు లనడుమఁ జిక్కియున్నసారంగిభంగి నై యి ట్లని చింతించె.

క. "ఇట కే వచ్చుట తెలిసిన
జటాయుపతగేంద్రుఁ డకట చచ్చినకతనన్
బటుధీయుం డగుపతి యే
నిట నుండుట యెఱుఁగఁ డంచు నెంచెద మదిలోన్. ౨౧

వ. కాక రాక్షససహాయుచే స్వభావము మాఱి కాకుత్స్థునకు నాయం దనాదరంబు కలిగియుండనోపు.

గీ. నన్ను మాత్రమే కాక నానాథు సహజ
కృపను గూడ నీక్రూరాత్ముఁ డపహరించెఁ
గాక యున్న సదయుఁడు లోకైకవీరుఁ
డతఁ డుపేక్షించి యుండునే యకట నన్ను". ౨౨

వ. ఇట్లు విలపించుచు రఘుపుంగవునే సంతతంబుఁ దలంచుచు జానకి మూర్ఛవోయె.

గీ. చేరి దనుజలు నిరవద్యశీల యైన
దాశరథికాంత నెంతయుఁ గాసిఁ బెట్ట
వారి వారించి తాఁ గన్నవాఁడికలను
త్రిజట వినిపించె దేవతల్ ప్రీతి నొంద. ౨౩

గీ. అండఁ దరువు లేకుంటచే నవని వ్రాలి
పొరలుచుండెడు తీవియకరణి దోఁపఁ

గరము న క్తంచరీముఖ కర్శిత యగు
సీత కప్పుడు త్రిజట తా నూఁత యయ్యె. ౨౪

—* హనుమంతుఁడు జానకితో సంభాషించుట *—

గ. రాక్షసాంగనలు పెట్టినబాధలు సహింపఁజాలక ప్రాణత్యాగంబు
చేయం దలంచుచుండ నింక నుపేక్షింపం దగ దని మారుతి యా
దేవి సమీపంబునకుం జని.

గీ. దశముఖోగ్రవాక్యకులిశదారితంబు
లైన జానకి చెవులగాయముల మాన్ప
రఘుకులస్తోత్రపూర్వక రామచంద్ర
చరితకీర్తనామృత మల్లఁ జల్లె నతఁడు. ౨౫

గ. ఆపలుకు లాలకించి సీత కన్నులు తెఱచి శాఖపై నున్న శాఖామృ
గంబుం గని పాడుకలఁ గంటి ననుకొని రామలక్ష్మణులక్షేమముం
గోరుచునంత "నిద్రయే లేని నాకు స్వప్న మెట్లు కలుగును?
ఇతఁడు మాయవేషము పూని వచ్చిన దశకంఠుండు గాని య
న్యుండు కాఁ"డని తలంచి యత్యంతత్రాసంబు నొందె. అది కని
పట్టి పావని చెట్టు దిగి వైదేహి యెదుట నిలిచి బహువిధంబుల
నద్దేవికి నమ్మిక పుట్టం బలికి కృతాంజలి యై యి ట్లనియె.

ఆ. వె. "నిన్నుఁ బాసి యుండ నిముస మైనను దాళఁ
జాలకుండ మిగులఁ దూలి యున్న
రామచంద్రు దూత నోమాన్యచరిత నీ
వన్యుఁగాఁ దలఁప కమ్మ నన్ను. ౨౬

క. హృదయము నీతో నాతని
వదలి చనన్ రాత్రి చక్రవాకముభంగిన్
మదిఁ గుందుచుఁ బతి నీ విటఁ
బదిలముగా నుంట నరయఁ బంపెను నన్నున్. ౨౭

క. సౌమిత్రి నీకు మ్రొక్కెను
నేమంబున దనశిర మవనీతల మంటన్

శ్రీమంతుఁడు కపిపతి సీ
క్షేమం బడిగెను వినమ్రచిత్తుండగుచున్". ౨౮

—*హనుమంతుఁడు రామాంగుళీయకంబును సీత కొసంగుట*—

గ. ఆమాటలు విని కొంత నమ్మకము కలిగి "ఆర్యపుత్త్రునకు సుగ్రీవునితోఁ జెలిమి యెట్లు కలిగె"నని జనకతనయ ప్రశ్నింప మారుతియాకథ యంతయుం జెప్పి ప్రాచేతసచిత్తంబుపోలికె సంతత సన్నిహితరామనామమంగళం బగు నంగుళీయకం బొసంగె.

ఉ. భూరిసుఖావహం బగుచుఁ బొల్పెసలారెడు రామముద్రికన్
ధీరత నంజనాసుతుఁడు తెచ్చి యొసంగిన యల్లనాఁటిలో
నూఱువయంశ మాటకును నోఁచకపోయెను దొల్లి రాము నిం
పారగఁ దా వివాహ మయినట్టి శుభాహము వారిజాక్షికిన్. ౨౯

గ. ఇట్లత్యంతానందభరిత యై భూపుత్త్రి వాయుపుత్త్రునితో నిట్లనియె.

"మహాభాగ! దురాత్ముండగు రావణునకు మృత్యువాసన్నమై యున్నయది. విభీషణునికూఁతురు అనల తల్లి పంపఁ దానిటకు వచ్చి యట్లే చెప్పినది. తురీయోపాయంబుచేతఁ గాని యనార్యశీలుం డగు నీతం డార్యపుత్త్రునకు నన్ను సమర్పింపఁడు. అదినిశ్చయము. నేను నొకమాసంబుకంటెఁ బ్రాణంబులు ధరియించి యుండఁజాలను."ఇట్లనుడుఁ బావని "మహానుభావురాలా! భయపడకుము. నిన్ను నే నిప్పుడే యెత్తుకొనిపోయి సముద్రము దాఁటి రఘువీరచరణసరసిజసమీపంబునకుం గొనిపోయెద. నే నట్లొనర్పం జాల నని యెంచవలదు".

ఆ. వె. అనుచు మేను వెంచి యంజనాతనయుండు
మహితపర్వతంబుమాడ్కి యయ్యె
నల్లయాకృతిఁ గని నట్టివారల కెల్ల
జలధి పల్వలంబు సరణిఁ దోఁచె. 30

చ. అది గని మోదమంది జనకాత్మజ యిట్లను "సాగరంబు గో
ష్పదగతి దాఁట జాలిన యపారబలుండవు నీ కసాధ్యమై

నది యిఁక నెందుఁ గల్గు నటులయ్యె ననుం గొనిపోవువేళ నీ
పదవికిఁ జాల సంకటము వాటిలు నంచుఁ దలంతుఁ బావనీ. ౩౧

వ. అదియునుం గాక.

చ. దితిజాధీశ్వరు హీను నే నిపుడు పాతివ్రత్యసత్ప్రాప్తి కా
హుతి సేయుం జెడు రామబాణమునకున్ యోగ్యాశనం బంతఁ ద
త్సతికిన్ గీర్తిందుఁడు మ్లానతం బొంసి సంక్షీణించు నాయాత్మ యీ
పతితు న్నాపతి కూల్చినప్పుడ గదా భావింప సార్థం బగున్". ౩౨

వ. అనిపలుకు వైదేహిపలుకులు విని వినతుండై పవనతనయుండు జనకతనయ కిట్లనియె.

గీ. “కపటమృగముచే వంచనగన్ననీవు
విటపమృగముచేఁ జెఱ వీడి వెడలఁ గూడ
దద్ది జగతిలో వ్యాపించి నట్టులైన
రామబాణంబు ప్రఖ్యాతి ప్రయ్యకున్నె. ౩౩

వ. పెక్కు మాట లేల నీమాటలు చరితము నిశ్చయము నివి యాన్వియు క్షత్త్రియాణికి సదాచార సంపన్నకు రామపత్నికిం దగినట్లున్నవి. రామలక్ష్మణులు తప్పక యీలంకకు వచ్చెదరని నమ్ముము. తిరిగి పోవుటకు నా కనుజ్ఞ యిమ్ము. రాఘవేంద్రున కానవాలే దయిన నిమ్ము” అనిపలుక, జానకి నిట్టూర్పు నిగిడించి మారుతి కిట్లనియె. “తొల్లి యొకప్పుడు చిత్రకూటతటవనంబున రఘునందనుండు నాయొడిలోఁ దల యిడి నిద్రించుచుండ ధారాధరంబను కాకి నాపయోధరంబులపరిసరంబున జీరఁ రఘుపతి చూచి.

గీ. కుశము బ్రహ్మాస్త్రముం జేసి కూళకాకి
పైఁ బ్రయోగింప నద్ది యావాయసంబు
కన్నొకటిమాత్రము హరించి కాచి విడిచె
నాఁడు మొదల దది చిరజీవినామ మొందె.” ౩౪

వ. అని పూర్వపరిచితకథను జెప్పి చూడామణిం గూడ నానవాలుగా నొసంగె.

చ. దనుజకృతాపరాధజనితస్ఫురదుగ్రరుషాగ్నికీల నాఁ
దనరెడు నాయనర్ఘ్యమణిఁ దన్వి మరుత్సుతు చేతఁ బెట్టఁ జే
కొని మణిగర్భితాస్యఘనకుండలిసన్నిభ బాహుఁ డౌచు భూ
తనయకు మ్రొక్కి వీడుకొని ధన్యుఁడ నైతి నటంచు నెంచుచున్.

—* హ ను మ ం తుఁ డ శో క వ న భ ం గ ం బొ న రి ం చు ట *—

క. పలలాశికిఁ దనరాకను
దెలుపంగాఁ గోరి వినుతధీరుండు మహా
బలసుతుఁ డుత్సాహముతోఁ
బొలియంగాఁ జేసె నల్ల భూరివనంబున్. 36

గీ. కడఁగి శాఖావనతిచేసి పెడతెరువులఁ
దిరుగుచు సుమనోభంగంబు కర మొనర్చి
శ్రుతిమనోహరవాగ్ద్విజవ్రతతి నొంచి
యనిలపుత్రుండు దశకంఠు నతిశయించె. 37

గ. ప్రమదవనభంగంబు కావలివాండ్రచే విని కుపితుండై దశకంఠుండు ప్రహస్తపుత్రుం డగుజంబుమాలితోఁగూడఁ గృతాంతకింకరులం బోలు కింకరనికరంబుం బంపఁ బవనజుండు వారలనెల్లం జంపి చైత్యతోరణముపై వ్రాలె. సప్తమంత్రిపుత్రులతోఁగూడననేకులు రక్కసులు చచ్చిరని విని కుపితుండై రావణుం డావలీముఖుజీవగ్రహంబుగాఁ బట్టితెండని సింహపరాక్రములైన ప్రఘసప్రముఖసేనాపతుల నైదుగురం బంపె. వారలం గూడఁ బరిమార్చి దాశరథిదూతను నే నని మాటిమాటికిం జాటుచున్న యామారుతిం బట్టికొని రా సకలరాక్షససేనాధ్యక్షుం డగు నక్షకుమారుం బంప

శా. వక్షశ్చూర్ణితహేమభిత్తికరజోవ్రాతంబు పైఁ గ్రమ్ముటన్
నక్షత్రాధ్వ మకాలలోహితరుచిన్ దట్టంబుగాఁ దాల్పఁగా
రక్షశ్చారము లుర్వియన్పులుకపైఁ బ్రాఘింబడన్ వైచుచున్
అక్షక్రీడ యొనర్చె వాయుజుఁడు లంకాళిందభాగంబునన్. 38

గ. అట్లు రాక్షసులెల్లరుం జూచుచుండ నక్షయుం జంపి చైత్యప్రాసాదస్తంభంబులం బెఱికి యందుద్భవంబగు పావకంబుచే నెల్ల దహిం

చి మారుతిమరలఁ దోరణంబుంజేరె. ఈవృత్తాంతం బంతయు విని యతికుపితుండై కన్నులిరువదియు నొక్కుమ్మడి నింద్రజిత్తుపై నిలిపి.

చ. అని యొనరించువేళనిను నల్లనఁ జూడగఁ జాలువార లా
యనిమిషలోకమందునను నాకసమందున భూతలంబునం
గనుఁగొనఁ జాలమంచు నొడికంబుగ సంస్తుతిచేసి, పోయి యా
వనచరుఁ దెమ్మటంచు సుతుఁబంపె సురాధిపవైరి యత్తఱిన్. ౩౯

చ. దనుజవరూథినుల్సమయ దానవభర్త విషాద మొందఁగా
దనుజనితంబినీజనము తద్దయు శోకముఁ నొంది కుందఁగన్
దినకరుఁడు న్విధుండు సొరనేరనిలంక శిఖిన్విశుద్ధమై
తనరఁ బెనంగిరయ్యెడల దానవపుత్రుఁడు వాయుపుత్రుఁడున్. ౪౦

గీ. ఘనతరోగ్రసంగ్రామ దుర్దినమునందుఁ
దఱచుగా శరవర్షంబు గురియుచుండ
మేఘనాదము చే నెమ్మి మిగులనలరు
నట్లు మేఘనాదువలన నలరె హనుమ. ౪౧

—♦ రాక్షసులు హనుమంతుని గట్టి రావణునొద్దకుఁ గొనిపోవుట ♦—

క. ఆసమరంబున నిశాచరవీరులనేకులు చచ్చుటయు నితరాస్త్రంబులు వితథంబు లగుటయుం గని యింద్రజిత్తు బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించి విజయశ్రీసగంధుండగు గంధవహానందను బంధింపఁ దక్కినరక్కసులు జనువనారతాళ్ళచే నాతని యొడలంతయు బిగియంగట్టిరి.

గీ. అసురులారీతి మారుతి నంటఁగట్టి
నట్టికట్టు లెల్లను బూర్వమందు దనుజ
భర్త చెఱలఁ బెట్టిన సురవనజముఖుల
కట్లు విడిపింపఁగా నయ్యెఁగారణంబు. ౪౨

గ. ఈరీతిం గదియంగట్టి హనుమంగొనిపోయి యనిమిషపతివైరి తనజనకుని యెదుటం బెట్ట.

సీ. అంధకారాతిలీలాద్రితోలనచణ
ప్రఖ్యాతి వింశతి బాహుబలుని
బందీకృతామర వారవధూధూత
చామరమారుత చలితపటుని
పాటలాధరపుట భాసురదంతాగ్ర
రుచిశారవిగ్రహరుచిని దనరి
సంధ్యాంబుదాంతర చరదిందురేఖచేఁ
బొలుపొందు నీలాద్రిఁబోలువాని
సంగ్రామకేళినాశాదంతి దంతముల్
విఱిగి వక్షంబున నిఱికి కొనఁగఁ
దరగలనెల్లెడ మెరసెడిఛాయాత్మ
విధుతోడి యుదధినా వెలయువానిఁ
గైవల్యపదవినిఁ గడఁగి నిరోధింపఁ
బాపము ల్దాల్చినరూపమనఁగ
సూర్యేందుపావక సురుచిర కాంతులం
దపముచే గెల్చిన తమమునంగఁ
దనరువానిని దశకంఠుఁగనియె నతఁడు
నతనిఁగనుఁగొని వెఱఁగంది యాత్మఁ దలఁచె
వెండికొండను దానెత్త మండి శాప
మిచ్చిన యలనందీశుండు వచ్చెననుచు. 83

—: హనుమంతుఁడు రావణునితో సంభాషించుట :—

గ. ప్రహస్తుం డడుగు ప్రశ్నంబు లన్నింటికి నుత్తరంబుగాఁ బావని రావణునకిట్లనియె "నేనుపితృనియోగంబున వనవాసవ్రతంబూని శూర్పణఖావైరూప్యంబున కలిగియుడరిన ఖరాదిఖలపలాశ పలాల జాలంబునకుం గల్పాంతానలుండై కపటహరిణముంజంప నేగిన సమయంబునం బ్రియురాలిం గోలుపోయి వెదకుచుండు తఱి సుగ్రీవునితో సంఖ్యం బొనర్చి వాలియనుకంటకు నుత్పాతంబుగావించి దురవ్ర్రత్తక్షత్రియవంశవనదహనుండగుజామదగ్న్య భుజాబలంబవ

లీలం దూలంబు గావించిన సత్యసంధుండగు దశరథనందను దూతను. జానకిజాడనరయ నినతనయుం డంపిన వానరులలో నొక్కండ. వారాశి దాటివచ్చి భవదుపవనవాటిక భూపుత్రింగాంచి మ్రొక్కి మరలిపోవుచు నారాక నీకెఱింగింపఁ బ్రమదవనంబుం గూల్చి నిశాచరకృతంబగు కేవలలూతాతంతుబంధనంబు నినుఁ జూచుతమి నంగీకరించి నీయొద్దకు వచ్చినాఁడ.

ఉ. నాకముదాఁక సజ్జనమనంబుల కెక్కిన సచ్చరిత్ర ని
క్ష్వాకుకులావతంసు కులభామినిఁ గట్టఁ దలంచె దేలొకో
ప్రాకటయజ్ఞవేదిఁ బ్రభవంబునుగన్న శిఖి న్మదాంధుఁడై
కోకను మూటగట్ట మదిఁ గోరెడుమూర్ఖుని రీతి దుర్మతీ. ౪౪

చ. ఘనపిశితాశఁ బైఁదిరుగు గ్రద్దలమూఁకయ యాతపత్రమై
యనిమొనలక్ష్మణేషుహతమై భువి నీమెయి వ్రాలకుండఁగా
వనితల బాష్పవారియు నివాపజలాంజలి యాచు నొప్పఁగ
న్వినుతపుల స్త్యసత్కులము నీవలనం జెడకుండఁ జూడుమీ. ౪౫

చ. పరసతు లెందఱం దివిరి పట్టినఁ బట్టెదుగాక నీవు భా
స్కరకులవార్ధిసోము కులకాంతను బట్టఁ దలంపఁబోకుమీ
యురగకులాధినాథుఁ డనిలొాదనుఁడ న్గదనేనటంచుఁ దా
గరుడునిశ్వాసమారుతముఁ గ్రక్కునఁ గ్రోలఁ దలంపఁబోలునే. ౪౬

గీ. బాహువనెడు చందనపాదపంబునందుఁ
దూణ మనుకోటరమునుండి తూర్ణముగను
బాఱి వచ్చెడి రామశరోరగంబు
గ్రక్కునను గ్రోలు నీప్రాణగంధవహుని. ౪౭

చ. పలుకులు వేయునేల కులపాంసన మాయమృగంబుపాటులం
దలఁచినఁ దోఁకతోడనిను దక్షతఁ గట్టిన వాలిపాటులం
దలఁచిన రాఘవేశ్వరు శితప్రదరాళికి భక్తి మ్రొక్కుట
ల్వొలిగ నమోఘమైనయది వేఱు తనుత్రము లేదు నీకెటఁ. ౪౮

చ. అనుచు వచించునట్టి పవనాత్మజుపల్కులు వించుఁగ్రుద్ధుఁడై
యనయుతఁ బఙ్క్తికంఠుఁడు భటావళితోడ వధింపుఁ డీర లి

వనచరునంచుఁ బల్క విని పావనధీయుతుఁ డౌ విభీషణుం
డనయము మాన్పె దూతలు యథార్హులుగా రనుధర్మమూఁతగన్.

వ. దశవదనుండు విభీషణు భాషణంబు లంగీకరించి పావనిం జంపుట
డిగి ప్లవంగుల యంగంబుల వాలంబే వరం బగుట వీనితోఁకకుం
బట్టలు చుట్టి మంటనంటించి కొట్టుచు సాటించి పురంబెల్ల నూరే
గింపుం డని రాక్షసుల నాజ్ఞాపింప వారును నట్లొనర్చిరప్పుడు.

గీ. పావకుం డంతకంతకుఁ బ్రజ్వరిల్లి
వాయుసూనుని యాయత వాలమందుఁ
గర్ణికారగుళుచ్ఛంబు కరణినమరె
నమరు లత్యంత మోదంబు నందుచుండ. ౫౦

వ. ఈవృత్తాంతంబు రాక్షసాంగనలవలన విని దూయమానమాన
సయై జానకి పావకు నుపాసించి హనుమంతుని వాలంబునఁ జల్లని
వాఁడ వగు మని ప్రార్థింప.

గీ. ఉగ్రశీతాతపోమయ హుతవహునకు
నింధనంబౌదు నేనని హెచ్చుభీతి
ననలుఁ డెంతయుఁ జల్లనై యనిలపుత్రు
వాలమందున మణిదీపభాతిఁ దనరె. ౫౧

వ. పవనతనయుండు "చీఁకటిమూలమున నీపురమును జక్కఁగాఁ
జూడనైతి. అనలైకసాక్షికంబుగా నిప్పుడు విశదంబుగాఁ జూతుం
గాక" యని చుట్టియున్న రాక్షసగణంబును దోరణపరిఘంబుచేఁ
గొట్టి చంపె నప్పుడు.

గీ. సీత యనులక్ష్మిఁ బ్రభుతోడఁ జేర్పఁబూని
సైన్యవీచియాలంకాఖ్య సాగరమును
వేధ మథియించెఁ బాశాహివేష్టితమగు
పవనపుత్రాఖ్యమంథర పర్వతమున. ౫౨

## —* లంకాపుర దహనము. *—

వ. అంతలంక కాలంజొచ్చె.

మ. ధరనా నొప్పెడు నెమ్మికిన్ జలదమై, దైత్యాంగనాస్యాబ్జశ
ర్వరియై, రావణకీర్తిహంసతతికి న్వర్షాహమై, తత్పురీ
వరహైన్యోచితవేషసంభృత జటాభారంబునై, సీతకు
న్వరమిత్రత్రిజటాభమై దశదిశల్ వ్యాపించె నాధూమముల్. ౫౩

ఉ. మారుతివిక్రమంబునకు మానక క్రమ్మెడు హర్షబాష్పముల్
క్రూరనిశాచరాధిపుని కోపభరంబునకల్కి దాఁపఁగాఁ
గోరువియచ్చరాళికి నకుంఠితహర్షముఁగూర్చె నశ్రువు
ల్కాటుకన్నెపం బొకటి కల్పన చేయుచు ధూమముత్తతిన్.

గీ. ఘననీలధూమ మాగతి
వినువీదిని బర్వుచుండ వేలుపుటింతుల్
మనమున విస్మయ మందిరి
కననయ్యెను యమున మననగరమం దనుచున్. ౫౫

చ. ఘనమగుధూమ మత్తతిని గ్రాలఁగఁజొచ్చె దిగంగనాళికిన్
ఘనకటి నీలవస్త్రమయి కౌనున గారుడరత్నకాంచియై
స్తనతటిఁ బత్రభంగమయి చారుగళంబున నీలమాలయై
కనుఁగవయందు మెత్తనగు కాటుకయై విలసిల్లి యెల్లెడన్.

మ. సురనారీ వదనారవిందతతికి న్సొంపారు నీరాజనో
త్కరమై యంబుధియందు నౌర్వశిఖియై కాదంబినీహీనపు
ష్కరమందుం జపలాలతానిచయమై చల్లాఱుట ల్లేక వా
నరవాలానలకీల లేచి వెలిఁగెన్నాల్నాళ్ళ హేలాగతిన్. ౫౭

గీ. పవనపుత్రకవాలాగ్నివలన లంక
కనలి యంగారశేషంబుగాఁగ మండ
నిజగృహంబులమంటఁ గన్నీటిజడిని
నార్పి రాకాశముననుండి యసురలపుడు. ౫౮

చ. అసురవిభుండు తోడయినయప్పుడుఁ జూపఁగ లేని విక్రమం
బసురకులేంద్రపుత్రకుని యాజ్ఞ సురారులు చూపినట్టులన్
శ్వసనసహాయుఁడైనపుడుఁ జల్పఁగఁ జాలని దాహకర్మముం
శ్వసనతనూజుసంగతినిఁ జక్కనొనర్పఁగఁ గల్గె నగ్నియుం.

చ. సమరకుతూహలుండగు నిశాచరనాథుఁ డవార్యబాహువీ
ర్యమున హరించినట్టి యమరాధిపరాజ్య సరోజగేహదా
నమితజవాఢ్యమారుతిమహారణిసంభవ వహ్నిశుద్ధయై
నమితసురారియైన నిజనాథునిఁ గూడఁ దలంచె వెండియుఁ.
గీ. పెక్కుమాటలఁ బనియేమి యక్కజముగ
రావణభుజగుప్తమయిన లంకయందు
మొనసి శ్రీరామదూత తాముందుఁజొచ్చి
దండధరునిదూతలుఁ రాఁగ దారిచేసె. ౬౧
ఉ. మారుతినాఁగ నొప్పుయజమానుఁడు నేమముతోఁబలాశవి
స్తారసమూహ్యయోహసమిధల్ నిజవాలగతాగ్నియందు నిం
డారఁగ వేల్చి యక్షజయమంది నిశాచరనాథుసంగతిం
జేరినపాపసంఘము లశేషమడంగఁగ నొందె సద్గతిఁ
ఉ. పావకుచేత రాక్షసులపట్టణ మాగతి మండుచుండ సం
భావితశీల జానకి యపాయము నొందమికాత్మఁ బొంగుచుం
బావని యామెయాజ్ఞఁ గొని పర్వతమెక్కి కడంగి దుస్తరం
బౌవనధిం దరించి కపులాడఁగఁ జేరె మహేంద్రశైలముఁ. ౬౩
గ. అట్లు చేరి సైన్యాధిపతుల యథార్థ్వంబుగా సమ్మానించి తనవృ
త్తాంతంబంతయుం దెలుప వానరబలం బమితానందంబునొందియీ
సువార్త విన్నప్పటి దాశరథిసుగ్రీవులయానందతారతమ్యంబుఁ గ
నుకుతూహలంబునయూథనాథులు వెంటరానహమహమికతోఁజను
చు మార్గమధ్యంబున దధిముఖ రక్షితంబగు మధువనముం జొచ్చి
హనుమంతునను మతిచే మధువుయథేచ్ఛంబుగాఁ ద్రావి సుఖించిరి.
గీ. అంత దధిముఖుఁడెంతయు నాగ్రహించి
యంగదునిఁ జేరిమ్రొక్కి యిట్లనియె వినతిఁ
దేనెఁ గపులానుచున్నారు తేటులట్లు
మాన్పగాఁ దగుమీరలు మాన్యచరిత. ౬౪
గ. అట్లువిన్నవించు దధిముఖున కంగదుఁడిట్లనియె.
గీ. రావణునియింటనున్నది రామభార్య
యనెడు మధురసువార్తనాకానతిచ్చి

నట్టిహనుమంతునాజ్ఞకు నడ్డుగలదె
కానఁ గపిసేనఁ దేనెల నానవిమ్ము. ౬౫

గ. అంతవిలువక భయాక్రాంతుఁడై దధిముఖుండు సుగ్రీవుపాలికిం జని వానరబలకృత్యంబంతయు నెఱిఁగింప దానివలన సీతాదర్శనం బైనట్లు గ్రహించి యినసూనుం డమితానందంబునొందె నంతఁ గపిసేన వెంబడింపఁ బావనియుఁ దా సిల్లె.

చ. వనచరసేన లత్తఱిని బర్వత మెక్కుచుఁ గ్రిందదూఁకుచున్
ఘనపాదమత్తతం దరులఁ గానివిధంబునఁ గౌఁగిలించుచు
న్వనములఁ గాయలందినుచుఁ బాడుచు నాడుచుఁ దోకలెంతయుం
గనుకనిఁ జిమ్ముచుం గరముఁ గాపర మెత్తిచరించె నెల్లెడన్. ౬౬

—*హనుమంతుఁడు రామునకు జానకీ చూడామణి నిచ్చుట.*—

గీ. నిదుర లేమిని నరుణమై నెగడునట్టి
కనుఁగవం దన్ను సౌమిత్రి కనుచునుండ
సీత చూడామణిని దాను జేతఁబూని
భరతునన్నకు మ్రొక్కెను బవనజుండు. ౬౭

క. అణుమాత్రము శ్రమ మందక
వననిధి యినుమాఱు దాఁటి భాసిలునప్పా
వని కపిసేన సమస్తం
బున హర్షాంబునిధియందు మునిఁగియె పోయెన్. ౬౮

క. జనకజచూడామణిఁ గని
ఘనతరమోదంబునొంది కాకుత్స్థుఁడు త
న్ననయం బడిగినఁ బావని
వినయంబునఁ జెప్పఁ దొడఁగె వృత్తంబెల్లన్. ౬౯

ఉ. పాపవశంబుచే నురగపార్థివకన్య సువర్ణలోకమం
దోవఁగ రానికష్టముల నొందెడు నోజ మహోగ్రరోషలా
పాపనిశాచరుల్ మృగుల బాధలు పెట్టుచునుండ నల్లలం
కోపవనంబున న్నవసి యున్నవిదేహసుపుత్రిఁ గాంచితిన్. ౭౦

గీ. భవ్యభవదీయవంశాభివర్ణనమున
నుంగరముఁజూపియును సీత యుమ్మలంబు

పాపి సంతసించి తిరిగి వచ్చువేళ
నానవాలగువార్త నే నడిగినంత. ౭౧

చ. కనుఁగన బాష్పము ల్దొఁగఁగాననమందునఁదొల్లి కాకిరూ
పనువుగఁదాల్చివచ్చిన జయంతునికృత్యము దెల్పిచూడమం
దున వెలుఁగొందు నీమణినిఁ దోరపుభక్తి నొసంగె నీకు ని
మ్మనుచు విదేహరాజసుత యర్యమవంశ సుధాబ్ధిచంద్రమా. ౭౨

గీ. పెక్కుమాటలఁ బనియేమి వెడలిపోవఁ
దలఁచియుండియు నాశచే నిలిచియున్న
దేవి యసువుల నీపేరి దివ్యముద్ర
చేత ముద్రించివచ్చితి భూతలేంద్ర. ౭౩

ఇది శ్రీమత్కౌశిక గోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకరసుధాకర రామయ నామధేయ
ప్రణీతాంధ్ర చంపూరామాయణంబు
నందు సుందరకాండము సంపూర్ణము.

---

# యుద్ధకాండము.

గీ, ఆంజనేయకథితమైన యవనిపుత్రి
యనఘవృత్తంబు ముదముతో నాలకింపఁ
దరణికులవార్ధిశశిదృష్టి యరుణమగుచుఁ
బ్రక్కనున్నట్టి వింటిపైఁ బర్వెనపుడు. ౧

గ. దశగ్రీవకుపిత రాఘవాలోకన ద్విగుణీకృతోత్సాహుండగు సుగ్రీవుండు ప్రతిజ్ఞాపరిపాలనతత్పరుండై యగాధధైర్యుండుగావున సింధువు నంధువుగాఁదలంచి యదిదాఁటి త్రికూటశృంగాలంకారంబగు లంకాపురంబు ముట్టడింప నంగదకుముదనలనీలాధిష్ఠితంబగు సేనసన్నాహం బొనర్చె నప్పుడు.

గీ. రామనామకవారిధరంబువలన
వెడలెడు నపాంగధారచే వృద్ధినొంది
యఖిలవానరవాహిని యట్టిపొంగి
తరలె దక్షిణవాహినీవరునిఁగూడ. ౨

గ. సమచలితఋక్షసముదయుండును, కుముదామోదకారకుండును, శరభాదికప్రసాదశీలుండును, నీలేందీవరానందకుండును, దశాననదిశాక్రమణవ్యగ్రతేజుండును, సమారూఢతారానందలక్ష్మణానుగతుండును నగు రామచంద్రుండు హనూమంతోదయసానుమంతం బధిష్ఠించి నిశాచరతిమిరవారణనిస్తంద్రుండై యుండ బహుళకోలాహలభరిత దిగంతంబును నిరంతరాస్కందిత నికటకాంతారంబు నగు వలీముఖబలాంబుధి సంభ్రమంబుతో విజృంభించె.

క. వనమున నెల్లమృగంబులు
ఘనతరభయమొంది మిగులఁ గలగుండువడ
న్వనచరయూథము లెల్లెడఁ
గనుఁగొనఁగాఁ దామెయగుచుఁ గ్రమ్మె వనంబున్. 3

—* వానరసేనతోఁగూడి రాముఁడు మలయపర్వతము చేరుట. *—

గ. రఘుపతియు సైన్యంబుతో నరిగి నదులు దాఁటి యరణ్యంబుల విరళంబులఁగావించి యసహ్యావాతంబగు సహ్యశైలంబెక్కి మందానిలనిలయంబగు మలయంబుఁజేరి సౌమిత్రితో నిట్లనియె.

ఉ. చందనపాదపాఖ్యనిజసద్మము లల్లన వీడి యద్రులం
దెందును బాఱుచున్న సెలయేఱులనీటిని గూడి శైత్యముం
బొంది పికాంగనారుతము మోయుచు నెంతయు దుస్సహంబులై
మందసమీరశాబకము లమందగతిన్మది గుందఁజేసెడున్. ౪

గీ. ఇట్లు కడువిలపించి మహేంద్రమెక్కి
రాఘవుఁడు ముదితంబైన రఘుకులేశ్వ
రాత్మ యయశోనిధానమౌ ననఁగఁజాలి
సుడులతో నొప్పు జలనిధిఁ జూచెనపుడు. ౫

సీ. సాగరంబును జూచి సగరాన్వవాయుండు
తద్దయు వెఱఁగంది తలఁచె నిట్లు
ఫణిలోకపతి గూడఁ గనిపట్టఁజాలఁడ
హీనమై పొలుపొందు దీనిలోతు
నాశాంతములదాఁక వ్యాపించునిద్దాని
సరిహద్దులూహింపఁ దరముగాదు
ఇందున్నయట్టి యీ యిసుకతిన్నెలు మేటి
ద్వీపంబులైకడుఁ దేజరిల్లు
నటులు దీని గోళ్ళ నవలీలఁగాఁద్రవ్వి
నీటనింపినట్టి మేటిమగల
నస్మదన్వయాబ్ధి వారిణాంకకల్పుల
మహితమహిమ నెపుడు మదిఁ దలంతు.

గ. ఇనకులతిలకు నాజ్ఞచే సుగ్రీవుం డంతఁ గపిసేన మహేంద్రోపాంతంబున సముద్రవేలోపవనంబునందు విడియంజేయ వానరులా వనంబునందుఁ బనస తాల రసాలాది నానాఫలాస్వాదన తత్పరులై యథేచ్ఛంబుగా విహరించిరి.

అంత రాఘవానీక మసీకోన్ముఖంబై సముద్రతీరంబు చేరియున్న దని చారులచే విని యూబిలో దిగఁబడిన యైరావతంబు పోలె రావణుండు వ్యథితమనస్కుండై, కామపరతంత్రుఁ డగుట సీతను వదలం జాలక యేమియుం బాలుపోక ప్రహస్తముఖ్యు లగు మంత్రులరావించి వారితో "నాయీప్సితంబు మీరెఱింగియే యున్నారుగదా! వైరి దండెత్తి రానై యున్నవాఁడు. ఇప్పుడు మనము చేయ వలసిన దేమి" యని యడుగ వార లాతని యాశయం బెఱింగి "దేవా! భవదాజ్ఞాపర పరిజనులము మేము జీవించియుండ నీయుప వాద మేలవచ్చెడిని. భవదీయోరుభుజపంజరానీతం బగు సీతను విడువం దగ" దని విన్నపించిరి. వారిపలుకులు విని నలకూబర నందీశ్వర నళినోద్భవదత్త శాపంబులు సీతను బలవంతముగా వశపఱుచుకొనుట కంతరాయము కల్పించినవని చింతించుచున్న యన్నతో నసమాన వినయ విజ్ఞాన విభూషణుండగు విభీషణుండు రోషంబుతో నిట్లనియె.

—: విభీషణుఁడు రావణునకు హితోపదేశము చేయుట :—

చ. పరసతిఁగూడఁ జూచెదవు పాపభయం బొకయింత లేక కే
సరి దవదాహముం బలలశంకను డాయఁగఁబోవు నట్టులన్
సరసిజగర్భకర్ణములఁ జయ్యన నీసడి దూఱనాతఁడే
వెరవున రెండు హస్తముల వీనుల నెన్మిది మూయఁ జాలెడున్. ౭

గి. లవణజలధియ పరిఖయా లంక యేడఁ
గపి యొకం డిటు దానిని గాల్చు టేడ
దనుజకులనాశ మొనరింప ధరణి తనయ
యనెడుపేర మాయ పొడమె ననుచుఁ దలఁతు. ౮

చ. నరులె యటంచు వానరగణంబులె యంచుఁ దిరస్కరింపకీ
వెఱుఁగవె కార్తవీర్యదివిజేంద్రతనూజుల సత్వమాత్మ భూ
వరము మనుష్యవర్జమను వల్కును నందికడింది శాపమున్
సరకుగ నెంచవేని విధిశక్తి యజయ్యమటంచు నెంచెదన్. ౯

౯. ఇట్లు నీతిసహితంబగు హితం బుపదేశించిన తమ్ము నవమానించి రావణుండు "వీఁడరాతి పక్షపాతుండు శిక్షార్హుం"డన నానృశంసు

వీడి మంత్రిచతుష్టయసహితంబుగా విభీషణుండాకాశమార్గంబున నెగిరి సముద్రంబుదాఁటి దూరంబునుండి కంఠంబులెత్తి సవితర్కంబుగాఁ జూచుచున్న సుగ్రీవాదులతో గగనమందుండియే యిట్లు పలికె.

—: శరణార్థియై విభీషణుఁడు రామునొద్దకు వచ్చుట. :—

చ. అనఘుపులస్త్యవంశభవుఁ డయ్యు దురాత్మకుఁ డైనయట్టి య
న్నను విడనాడి బాంధవజనంబును గూడఁ బరిత్యజించి దు
ర్జనులను గూల్చి సజ్జనులసాఁకెడు రాఘవు ప్రాపుఁ గోరి యే
వినతుఁడ నౌచు వచ్చితి విభీషణ నాముఁడ రామదాసుఁడన్. ౧౦

గ. ఈరీతి నతికరుణంబుగా వేఁడికొను నిశాచరపతితమ్మునింజూచి యాతనింగూర్చి యభిజ్ఞానపూర్వకంబుగా హనూమంతుం డొనర్చు విజ్ఞప్తి నవధరించి, తదాగమనకారణంబు శంకాపరవశుం డైన సుగ్రీవువలన నెఱింగి దాశరథిదయమానమానసుం డై స్మితపూర్వకంబుగా నినసుతుతో నిట్లనియె.

గీ. సఖుఁడ యభయార్థి విఫలుఁడై చనియె నేని
రఘుకులంబున కదిచాల లఘుతగాదె
యనుజుఁ డౌఁగాక తనుజుఁడే యగునుగాక
యరికి శరణార్థి యగువీనిఁ గరుణఁబ్రోతు. ౧౧

గ. రఘువరుహృదయంబెఱింగి హనుమంతుండేగి తోడితెచ్చుటయు నాదశాననానుజుండు వినీతుండై దాశరథికి మ్రొక్కె.

చ. వినమితగాత్రుఁడౌ నలవిభీషణుఁగూరిమితోడఁ జూచి యా
యినకులభర్త యిట్టులనె నిచ్చితి నీకిదె యన్నరాజ్యమున్
వనచరనాథువాలి విభవంబు సుఖాన భుజించుచున్న యీ
యినసుతుఁడే యుదాహరణ మిందులకున్ మఱిశంకలేటికిన్.

గీ. పదవిపైని మేల్పదవిని బడయవచ్చు
దైవకృపయున్న దశకంఠుతమ్ముఁడట్లు
రమ్యరేఖాతపత్రాంక రామపదముఁ
బట్టి యేకాతపత్రాంకపదముఁ గనఁడె. ౧౩

గ. రెండవసుగ్రీవుండుపోలె నత్యంత విస్రంభపాత్రుండగు విభీషణుండు తొలుత భరతాగ్రజాపాంగ సుధాతరంగాభిషిక్తుండును వెనువెంట రాజ్యాభిషిక్తుండునయి దశరథసూనునకు దశగ్రీవబలం బఖిలంబు నివేదించి వానరబలంబుదధిను త్తరింప సేతునిర్మాణంబవశ్యంబుగానం దన్నిమిత్తం బంబుధి నారాధింపవలయునని సవినయంబుగా విన్నవించె.

ఆ. వె. అంతరాఘవేంద్రుఁ డంభోధిధ్యానించి
దానితీరమందు దర్భశయన
మొనరఁజేసి యందు నొదిఁగి తా శయనించె
వేదియందు వహ్ని వెలయునట్లు. ౧౪

—* రాముఁ డబ్ధిపై నలుగుట *—

గ. రామభద్రుండట్లు కుశాస్తరణ మధ్యస్థుండై నియమంబున మూఁడు రాత్రులుం బగళ్ళు ధ్యానించినను సముద్రుండభిముఖుండు కాకపోయె.

క. అలకువ వారిధి తన్నటు
చులుకన సేయన్ రఘుపతి చూడ్కులరాగం
బలవడఁ గన్బొమలాడన్
జలనిధిపైఁ జాపమెత్తి సమకట్టె మదిన్. ౧౫

గీ. పావకాస్త్రంబు రాముండు వనధిమీఁద
విడువఁదలఁచినయంతనే వేల్పుటేఱు
ప్రియుని గతిచూచి కన్నీరువిడిచె మిగుల
వారుణాస్త్రంబు విడిచిన భంగిగాను. ౧౬

గీ. మందుతూపును లఘుత రాముండు విడువ
నక్రకుంభికుంభీనసచక్రమెల్లఁ
దద్దయును భీతిచేతను దల్లడిల్ల
నల్లకల్లోలమయ్యె నాయబ్ధి మిగుల. ౧౭

గ. కల్పాంతానలంబునకుం గాలకూటదహనంబునకు బాడబాగ్నికి భార్గవతీక్ష్ణకుఠారంబునకు నులుకక, బెదరక, జంకక నిలిచిన జలనిధి దాశరథియమోఘాగ్నేయాస్త్రంబు సహింపఁజాలక,

గీ. దారుణాశుగ బాధానిదానమైన
రామునే చేరె జలనిధి ప్రాపుఁగోరి
పరుషకులిశపాతంబైన వారిదమునె
జీవలోకంబు వారికై చేరుఁగాదె ౧౮

వ. ఉదధి యాగతి రఘునందనుం జేరి చిరత్నరత్నరాసులు కానుక
లొసంగి వినమ్రుండై బహువిధంబుల నుతించి "అమోఘంబగు
నీయస్త్రం బాభీరధామంబగు మరుస్థలయం దెందేని విడువవల
యు, సలిలావష్టంభంబు సహింతు, నిప్పుడే సేతువుంగట్ట నలునియో
గించునది" యని నివేదించి యంతర్ధాన మయ్యె. అంత.

—◆ సేతుబంధనము ◆—

గీ. ఎల్ల దిక్కులనుండి మహేంద్రు నాజ్ఞ
గిరుల మిక్కిలిఁ గొనితెచ్చి హరులు వైవఁ
బూడియు జలధి మరలఁ దాఁబూర్ణమయ్యె
గిరులఁ బ్రవహించుచున్నట్టి ఝరులనీట. ౧౯

గీ. గిరులు దాఁకివచ్చిన జలచరము లుసురు
వడసె నందున్న యోషధివ్రతతి వలనఁ
బొలువు చెడిపోయి సర్పము ల్ఫూత్కరింపఁ
గందరంబుల సింహము ల్కలఁతఁ జెందె. ౨౦

గీ. కొండలెత్తుట జలధిలోఁ గూర్చుటయును
గానరాకయుండ నలుఁడు గట్టినట్టి
సేతు వొప్పెను గూఁతురా సీతకప్పు ౨౧
డవనిచూపినట్టి యభయహస్త మనఁగ.

—: వానరసేనసువేలపర్వతము చేరుట :—

వ. అంతర్ముఖులు ప్రబోధంబుచే సంసారంబు దాఁటి స్వప్రకాశం
బగు పరబ్రహ్మంబుం గని యానందించు నందంబున వలీముఖంబు
లాసేతుపథంబున నబ్ధిలంఘించి ప్రకాశంబగు సువేలగిరీశంబుం గని
పరమానందంబునొంది, తద్గిరి తటంబుల నెల్లెడఁదామయై విజృం
భింపఁ దత్కలకలంబునకుం గందరంబులం గల కంఠీరవంబు లలిగి
రవంబు లుల్వణింపఁ జేయ వేలాతీతం బగు కోలాహలం బుప్పతిల్లె.

పిదప రాముం డుదధి లంఘించి సువేలారామంబున దిగి యు న్నాఁడని శుకుని వలనం దెలిసికొని దశవదనుం డాదశరథపుత్రు సేనం జక్కఁగాఁ బరికింప శుకశారణులను నిర్బంధంబంపె. ప్రచ్ఛన్ను లైవచ్చిన వారిగుట్టు విభీషణుచే నెఱింగి వానరు లవ్వారి బాధిం చిన విపన్నాధారుండగు దాశరథి కరుణచే విముక్తులయి ప్రాణ ములు దక్కించుకొని తాము కన్నదంతయు వారు నివేదింప రావణుండు ప్రాసాదం బెక్కి సమరోత్సుకులైయున్న వానర సేనా ధిపతుల వేర్వేఱఁ బరికించి చూచి వారల సరకు సేయకుండె. శత్రుబలం బనల్పంబని శుకసారణులు వినుతింప లంకాపతి వారి నుపేక్షించి చక్కఁగాఁ జూచిరండని శార్దూలాదిచారుల నంపుట యుఁ జూచివచ్చి వారునట్లనివేదింప ఖిన్నుండై చింతించి యతివిన తుండై యొద్దనున్న విద్యుజ్జిహ్వునితో రహస్యముగా నేదో చెప్పి సౌధము డిగి క్రిందికేతెంచె.

విద్యుజ్జిహ్వుండంత నిజమాయాబలంబున సశరంబగు రాముని శిరమ్మును గల్పించి చాపసహితంబుగాఁ దెచ్చి యుద్ధంబునుండి దీనిందెచ్చితినని యెదుటంబెట్ట నిదాఘాతిశయంబున వాడియున్న మాధవీలత విద్యుదనలంబున మిగుల శుష్కించుభంగి విరహ వేదనాపరవశయైయున్న మైథిలి యత్యంతాకులయై మూర్ఛ నొంది తిరిగి మేల్కని యదియె తథ్యంబనినమ్మి యిట్లు విలపించె.

గీ. అసురగృహవాస మాసుర విసరబాధ
యసురపతితర్జనంబివి యన్ని యెవనిఁ
గలయఁగోరి సహించె నో యలవిభుఁడిటు
లొటఁగాంచియు జీవించె నకటసీత. ౨౨

గ. అత్తఱి విభీషణు పత్నియగు సరమ “వైదేహి ! నీకీ దైన్యం బేల? ఇదియెల్ల రావణుమాయాకల్పితంబుగాని తథ్యంబుగాదు. సకల జగతీధుర్యభుజబలాభిరాముండగు రాము నెడ నీయనార్యవిచారం బొనర్పందగదు. నామాటనమ్ముము” ఇత్యాది వచనంబుల నవీనా సారనిష్యందిని యగు కాదంబిని గ్రీష్మాతపతప్తంబగు నెమ్మికిం బోలె మైథిలికి నూఱట గల్గఁజేసె.

ఆసమయంబున మాల్యవంతుం డనుసచివుండు దశకంఠుం జేరి జానకిని రాముని కర్పింపుమని బహువిధంబుల బోధించెం గాని-

చ. అని యనఁ జేతితీఁట ఘనమా సురవైరికి మాల్యవంతమా
ననిమిష సుందరీ నివహ మందునఁ గల్గిన మెప్పు ధారుణీ
తనయను వీడుమీ యనుచు ధర్మ్యము వల్కెడు మాల్యవంతుపై
మొనయక పోయె నాయు వటు మూఁడిన వానికిఁ బథ్య మించునే.

గ. అంత రఘునందనుండు గూఢవేషధారులై పరికించి వచ్చిన విభీషణామాత్యులవలన లంకాపుర రక్షణంబునకై చేయఁబడిన యేర్పాటుల నెల్లఁ దెలిసికొని సమరసంరంభియై యంబుధిమేఖలాలంకారం బగు లంకాపురంబు ప్రాగ్ద్వారంబు గాచియున్న ప్రహస్తునకుం బ్రత్యర్థి ప్రాణాంతకుం డగునీలుని, దక్షిణద్వారంబు రక్షించుచున్న మహోదరమహాపార్శ్వులకు విశ్వత్రయ విజయధౌరేయుండగు తారేయునిఁ, బడమటిద్వారముం బాలించు నింద్రజిత్తునకు మూర్తిమంత మా విక్రమం బననొప్పు హనుమంతుని నొడ్డనంబులఁ గావించి సమరాభిముఖుండగు దశముఖుం డధిష్ఠించి యున్న యుత్తరద్వారంబు దా ననుజసహితుండై ముట్టడించె.

గీ. కపిబలం బిటు పురిఁ జుట్టి క్రమ్మికొనఁగ
ద్వారముల నెల్ల మూసిరి దనుజభటులు
తత్క్షణంబ యాయమరాజధానియందుఁ
దలుపు లెల్లను దెఱచిరి ద్వారభటులు.

గ. సుగ్రీవసహితుండై లక్ష్మణాగ్రజుండు సువేలాచలకూటముపైకెక్కి సింహళద్వీప నామక కమలకర్ణికయు, విశ్వకర్మ నిర్మాణకౌశల పూర్ణోదాహరణంబును, త్రికూటాచల శిరోభూషణంబు నగులంకాపురంబునం దొకయున్నత సౌధంబున నాకృతిగన్న యంధకారంబు చందంబున నున్న దశకంధరుం గాంచె.

గీ. భానుసుతుఁ డంతఁ గినుకమైఁ బైకి నెగిరి
పావు దశకంఠు మకుటంబుఁ బడఁగఁ దన్ని

తననుజన్ము కిరీటంబుఁ బదిల పఱచి
భూరిగుణధాము శ్రీరాముఁ జేరె మరల. ౧౪

—* అంగదు రాయబారము *—

గ. "ఇట్టిసాహసం బానర్వ్హదగ" దని తపనసందను మండలించి ర ఘునందనుండు మంత్రివర్గంబుతోఁ గూడి యోజించి యంగదు నం పుటయు నాభుజబలశాలి సాలం బుల్లంఘించి లంకలోఁ బ్రవేశించి నృశంసుఁ డగు నిశిచరపతితో నిట్లనియె.

గీ. తోఁకతోడ నిన్నూపిరి రాకయుండఁ
గట్టిపెట్టిన యాజగజెట్టిసుతుఁడ
ఖలఖరాదుల పాలింటి కాలుఁ డైన
రాఘవేంద్రుని దూతను రాక్షసేంద్ర. ౧౬

గీ. శత్రువరు రాము మూఁడవ నేత్రమైన
సీతఁ బట్టగాఁ దలఁచెదు యాతుధాన
మేటి యరవింద మని చదలేటి తేఁటి
శివుని ఫాలమందలి కన్ను చేరినట్లు. ౧౭

గ. మఱియు.

చ. నలువకు వాడె మూఁడు వదనంబులు నీ కలకార్తవీర్యుచేఁ
గలిగిన భఙ్గపాటున నొకండును మజ్జనకుండు వాలిచేఁ
గలిగిన పీడనంబున నొకండును నీయవినీతి కొక్కఁడుణ్
నిలిచిన యొక్కమోము నటు నిల్వఁగ రాముని కిమ్ము భూమిజన్.

ఉ. అన్నకుబేరుపుష్పకము నట్టె హరించుట యల్లవెండికొం
డన్నలుసుం బలె న్మిగుల డంబుగ నెత్తుట వాసవాదులం
బన్నముపాలు చేయుటయుఁ బల్మటుఁ బ్రేలెదు మాని వేషముం
బన్నుగఁ దాల్చి దాశరథిపత్ని హరించితి విద్ది శౌర్యమే. ౧౯

గ. పెక్కుపలుకు లేల.

గీ. చేతఁ గోసి తొలుత నీవు శివునకిచ్చి
నట్టి తలలు తొమ్మిదిగాక యట్టె యున్న

దశమశిరములు బలిగాఁగ దనుజనాథ
రణమహాశక్తి కొసఁగుఁబో రాముఁడిపుడు. ౩౦

గ. దశకంఠుం డామర్కటచ్ఛేదక వాక్యంబుల సహింపఁ జాలక వీనిం బట్టుం డని యనుచరులం బ్రేరేప నలువురు నిశాచరు లావనచరు చేతులం గట్టిగఁబట్టికొన విహంగాధిపుండు భుజంగంబులం బట్టినవడువున నాతం డారక్కసుల నొక్కపట్టి పై కెగిరి వారిం గ్రిందఁ బడ వైచి కాళ్లతో వైరిశిరోభంగం బొనర్చుభంగిఁ బ్రాసాదశృంగభంగము గావించి యప్రతిరథుండై తిరిగి దాశరథిం జేరె.

సీ. రావణు దురితము ల్వీని రాముఁ దప్పు
డించుకంత కన్బొమలు జోడించె నవుడ
కపిబలంబులు లంకను గ్రమ్ముకొనియెఁ
బ్రళయమందున నౌర్వాగ్ని వార్ధిఁబోలె. ౩౧

గ. సమరమదమత్తవనచర కోలాహలంబున కులికి నక్తంచరులు దుందుభులు మ్రోయింప నాధ్వని రోదోంతరం బెల్ల నాక్రమించె. జగంబుల నదలించుపగిది దిక్కులం బిక్కటిల్లిన యాఘోషంబున రోషంబు పొడమఁ గందరంబులనుండి వెడలివచ్చు కంఠీరవంబు లతేవ రాత్రించరసమూహంబు నిజమందిరంబులు వెలువడి పయనంబులు వలదని బతిమాలుకొనుచుఁ గాళ్లకడ్డపడు పసిపిల్లలకలె దుశ్శకునంబు లడ్డగించినను సురవిలాసినీసహవాసోత్కంఠం బోలె వాని నిరాకరించి సంతతజ్వలితకోపానలంబుచే నరుణంబు లగునయనంబు లనుగొరివుల కులికి పెడదారిం బట్టు నేనుంగుల మరలించుచు నికేమఱి దిక్కుల నిండియున్న నక్కకూఁతల వినుపించుకొనక గ్రద్దఱెక్కలగాలిచేఁ దూలువతాకంబుల నొప్పు శతాంగంబు లెక్కి నితాంత నిశితకృతాంత దష్ట్రలంబోలు పట్టిసప్రాసాద్యాయుధంబుల ధరియించి దారుణాజగరసంతానంబుం బోలు కాలాయసకంకటంబులం దాలిచి కల్పావసాన కాదంబినీ వికల్పంబులో కాలరాత్రిమూర్తులో కలికాల వివర్తంబులో యన దండధరునకుం గూడ గుండెలవియు నట్లాహవభూమిం జేరి వీరవాదంబులు పలుకు

చు మేఘంబు లాసారంబులు గిరులపైఁ గురియుకరణి వలీముఖబలం బుపై శిలీముఖంబులం జిమ్మిరి. అప్పు డాశరవానరబలంబుల కతి దారుణంబగు దురంబు ప్రవర్తిల్లె నంత వనచరవీరమూరీకృతరా త్రించర ప్రతాపానలంబు పగిదిఁ బతంగబింబ మస్తంగతం బయ్యె. ఆయుధప్రహరణంబులచేఁ బగిలిన యోధగళంబులనుండి కాఱి ప్రవహించురక్తప్రవాహంబు పోలె సంధ్యారాగంబు రోదోంతరం బెల్లఁ గప్పుకొనియె. హరినఖవిదళిత దంతావళకుంభస్థలముక్త ముక్తాకలాపంబువడువునఁ జుక్క లాకాశం బలంకరించె. రణరభ సంబున లేచిన ధరణీపరాగంబురీతిఁ జీఁకటి భువనం బాక్రమించె. యామినీచరగణంబులపోలిక యామినీవిరహవిహంగంబులు సశో కంబులయ్యె. ఆశరకరంబులకరణిఁదామరసంబులుసకోశంబులయ్యె. దాశరథిబలంబుపగిదిఁ గుముదాకరంబులు ప్రమదాకరంబులయ్యె. అప్పుడు.

గీ. శరపరంపరల మిగులఁ గురిసి కురిసి
యాశరవ్రాదయముల కెంతో హాయిఁగొలిపి
జలదనాదుండు కపులను గలఁతపఱిచె
జలదనాదంబు హంసలఁ గలఁచునట్లు. 32

గీ. అంగదుం డంతఁ బెనుభూరుహమ్ముచేత
ద్రుంద నేసెను రావణి రథమును మఱి
రక్కసులమనోరథమును నొక్కపెట్ట
శిఖరికూటంబు నింద్రుండు చెక్కినట్లు. 33

—*ఇంద్రజిత్తు పన్నగాస్త్రంబులచే రామలక్ష్మణుల బంధించుట*—

గీ. మేఘనాదుండు మాయచే మింటనుండి
చక్క లక్షించి శ్రీరామచంద్రుమీఁదఁ
దమ్మిమీఁదను వర్షించె దట్టముగను
వ్యాళరూపంబుఁ దాల్చిన యస్త్రచయము. 34

గీ. బంధముల నెల్లవారికిఁ బాపఁజాలు
నట్టి రఘువంశపూర్ణేందుఁ డసురుతోడ

రావణురీతిఁ గడు భీకరంబు నైన
పాపతూపులచే నప్పు బద్ధుఁ డయ్యె. 35

చ. సురపతిజేత చేతమునఁ జొక్కెను మిక్కిలి పుష్పకంబుపై
నొరగి తపించె జానకి రఘూద్వహులం గని యంతలోపలన్
గరుడుని గాలి సోఁకుడు వికావిక లయ్యె భుజంగపాశము
ల్వరలిరి రామలక్ష్మణులు రక్తదినవల్లభ చంద్రము లట్ల రాఘవుల్. 36

క. దుర్వారం బగు నాయాయోధనంబున మారుతి ధూమ్రాక్షప్రకం
పనులఁ గరములం జదిపించె. అంగదుండు నగంబుఁ బెఱికి దానితో
వజ్రదంష్ట్రుని హతుఁ గావించె. నీలుండు బలంబునఁ బ్రహస్తు నంతం
బునొందించె. ఈగతిఁ బెక్కురు సేనానాయకు లుక్కడంగి చచ్చిరని
విని రణోత్కంఠుండైన దశకంఠుం డాయుధపాణియై మేరునగ
శృంగం బధిష్ఠించు మేఘంబుపోలిక రథం బెక్కి లంక యంతయుఁ
దన వెంట వచ్చుచున్నదో యనుగతిఁ జతురంగబలంబు లనుగమిం
ప భేరీనినదంబు దిక్కులం బిక్కటిల్లఁ బురతోరణం బతిక్రమించి
కపిబలంబుం గాంచె నప్పుడు.

గీ దశదిగీశుల గెల్చిన దండి వీరుఁ
బంక్తికంఠుని గన్గొంత భానువంశ
ముఖ్యుఁ డైనట్టి రఘునాథు మూర్ధమూఁగె
దక్షిణభుజంబు నదరెఁ దాఁ దత్క్షణంబ. 37

క. దశముఖుండును దిక్కులు లులుకుభంగి సింహనాదంబు సలుపుచు
నెక్కడఁ జూచినం దానయై యాదివరాహంబు వారిధిఁ గలంచు
తెఱంగున వానరబలంబు నాకులంబు గావించె. మఱియు నాదండి
వీరుండు తనపైఁ గొండల మెండుగాఁ గురియించు మార్తాండసు
తుని, బిడికిటి పోటుల ఘట్టించు హనుమంతుని, బతాకంబుల లాగు
నీలుని బాణప్రహారంబుల నొంచి తూలరాశిని వాతూలంబురీతి
వానర బలంబుం బొఱంద్రోలి యతి దీప్తం బగు శక్తిచే సౌమిత్రి
వక్షంబునం బొడువ,

గీ. అశ్రుధారల ననుజుని నాసుగముల
సురవిపక్షేంద్రుఁ గ్రమ్మి దాశరథి నెఱపెఁ
గరుణ వీరరసము లేకకాలమంద
శోకహర్షముల్ ప్రబలె ననీకమందు. ౩౮

చ. అనుజుఁడు మూర్ఛఁ దేఱి సమరాంగణమందు నరాతివర్గముం
జెనకఁగ వచ్చులోన సరసీరుహ మిత్ర కులోద్వహుండు తా
దనుజకులేశ్వరుం గడిమిఁ దాఁకి పరాభవమొందఁ జేసియుం
గనలునఁ బ్రాణముల్గొనక గాఢకృపామతిఁ గాచెఁ గాచినన్. ౩౯

ఉ. ఎన్నఁడు మున్నెఱుంగని యహీన పరాజయ మొంది వంది యే
తెన్నును దోఁపకున్న దినదీపదశాననుఁడై దశాననుం
డన్నన నింటికేగి యొడలన్న నెఱుంగని గాఢనిద్రమై
నున్న నిజానుజ న్రణముఖోగ్రుని లేపెను గుంభకర్ణునిన్. ౪౦

—కుంభకర్ణుని యుద్ధము—

గీ. మేలుకని కుంభకర్ణుండు మేలటంచు
నగ్రజుని యాజ్ఞ యాఁదలయందుఁ దాల్చి
శాశ్వతంబైన నిద్ర నొసంగఁ జాలు
రణముఖంబున కరుదెంచె రయము మీఱ. ౪౧

గ. చేరి కల్పాంతకాలశూలధరుండు పోలె శూలంబుఁ ద్రిప్పుచున్న యాయంజనాచలసంకాశుం గాంచి వాతాహతిచే జలదంబులు వోలెఁ జెదరిపోవు కపిబలం బంగదుండు వారింప మరలి యుత్సాహంబున గిరులం దరులం బెఱికి వానితో రావణానుజుం దాఁక నాతండును బ్రజ్వలాయమానం బగు త్రిశూలంబుం ద్రిప్పుచు పదోద్ధతి నేల గ్రక్కదలం ద్రొక్కుచు నీల వృషభశరభాదులం గొట్టి గవాక్షు బంధించె. వానరసేన శరణంబునకై రఘువరుం జేర వారి నాశ్వాసించి సుగ్రీవుండు భుజవీర్యంబు మెఱయ భూధరంబు లనేకంబు లాసురవైరిపైఁ బఱపి చిత్రసమరంబు చిరకాలంబు సలిపి చిట్టచివర కానక్తంచరవీరుం డేయు ధరాధరంబులు తాఁకి నిశ్చేష్టుండై కులిశదారితకులభూధరంబు వరుస నేలం గూలె.

సీ. కూలినాతని గొబ్బునఁ గుదియఁబట్టి
రావణానుజుఁ డేగెఁ బురంబు వంకఁ
బొంగి రసురులు తమరాజు పూర్వమందు
వాలిచేఁ గన్నయపకీర్తి పాసె ననుచు. ౮౨

గ. అంత నాసుగ్రీవుండు లంకారథ్యలందు వీచుచున్న కుసుమామోద
భరితశిశిరరథ్యోపచారంబుల నేదదేఱి నఖముఖంబుల నాఖరాసురు
శూర్పణఖామఖానుకారుం గావింప నాతం డాదారుణాకారంబు
తోడన ప్రాకారం బుల్లంఘించి మరల సమరాంగణంబున కేతెం
చిమదాతిరేకంబునఁ బ్రతిపక్షబలంబుతోడ స్వపక్షబలంబును భక్షిం
చుచుఁ బ్రతిఘటించుచు సౌమిత్రిని సరకుసేయక రయంబున రా
మునిం జేరి యతనిపై గిరిశిఖరం బొక్కటి విసరివైచె. రాఘవుండు

సీ. అర్ధచంద్రాఖ్యశరముచే నద్రిఁగూల్చి
ఖరుని మారీచు వాలిని నఱికినట్టి
యమ్ము లతనిపై నిగిడించె నవ్వి వమ్ము
గాఁగ నైంద్రవాయవ్యాస్త్రముల఼ బట్టి. ౮౩

ఉ. డక్కసి వీసు గాత్రముల రాముఁడు చెక్కె భుజద్వయంబునం
దొక్కటి తోల్త నాసురబలోదధిలోఁ బడె మందరంబునా
నొక్కటి యబ్ధియందుఁ బడి యొప్పెను రెండవసేతువోయన
న్నక్కొని యుండెఁ దచ్ఛిరము నింగిఁ ద్రికూటతురీయకూటమై.

గ. అప్పుడు మోదాతిశయంబుచే వానరులు చేయుకోలాహలంబు వ
లనఁ గుంభకర్ణునిపాటెఱింగి దుఃఖించి మహోదర మహాపార్శ్వుల
ను సహోదరుల సాయమిచ్చి వనుప దేవాంతక నరాంతకాతికా
యత్రిశిరస్కు లనుకుమారులు పితృపతి భువనంబుఁ జొచ్చుభంగి
రణభువనంబుం జేరిరి. అప్పుడు.

చ. దనుజబలంబు వానరుల దండు నవక్ర పరాక్రమోన్నతి
న్వెనుకకుఁ జూడకుండఁ గడుభీకరభంగిని బోర సాగి రా
యనిమిష సుందరీ నివహ మాత్మలఁ బొంగఁగ నారదుండునేఁ
గనుఁగొనలేద యీకరణికయ్యము మున్నని చాటి చెప్పఁగన్.

ఆ. వె. అంగదుండు చంపె నల్ల నరాంతకు
హనుమ దునిమె ననిమిషాంత కాఖ్యుఁ
బూర్వకాలమందుఁ బురఘస్మరుం డంధ
కాఖ్యుఁ బొలియఁ జేసినట్లు గాను. ౪౬

గ. అసమసమరశీలుండగు నీలుండు మహోదరుని మరున్నందనుండు త్రిశిరస్కుం జంపిరి. మఱియు మహాపార్శ్వాదివాహినీపతు లనేకులు సమసిరి. ఇది యంతయుం గని నిర్భరవిషాదరోషపరవశుండై నిశాచరాకారంబు గన్న తమోనికాయం బననొప్పు నతికాయుం డేతెంచి వృత్రాసురుండు సుత్రామునిఁ దాఁకినవడున్న లక్ష్మణుం దాఁక.

చ. చిరము పెనంగి లక్ష్మణుని చిత్తము వేసరి యుండఁ బద్మభూ
వరమున నీనిశాచరుఁ డవధ్యుఁడు సుమ్మని గాలి పల్కుడు
న్సరసిజగర్భు నస్త్రమును జయ్యన వీడెను; వీడఁ దచ్ఛిరం
బరుదుగ నింగి నిల్చె జగ మయ్యది రాహు వటంచు బెగ్గిలన్.

—ఇంద్రజిత్తు రెండవ యుద్ధము.—

ఆ. వె. దీనుఁడైన తండ్రిఁ దేఱంగ నూరార్చి
ధనువు శరధియుగము దగ ధరించి
సేనతోడఁ గూడి చెచ్చెరఁ గడిమియై
నేగి కలను సొచ్చె నింద్రజిత్తు. ౪౭

గ. వచ్చి యాజగజెట్టి తనరథంబును రక్షింప రాక్షసుల నియోగించి ప్రదక్షిణశిఖంబగుశిఖియందు వేల్చి మంత్రాధిగతంబు లగువివిధాస్త్రంబుల ధరించి తిరోధానుండై గగనంబునుండి వ్యాధుండు క్రవ్యాదులంబలె నిశితశిలీముఖంబులం బఱపి యంగంబుల నఱకి వానరబలం బెల్ల మూర్ఛిల్లంజేసి

వె. ఖరనిదాఘ మబ్జసరసినిఁ గ్రాఁచెడు
వీఁక రాము ననుజుఁ దాఁకి వారి
విధురసత్త్వయుతుల వికలాశయులఁ జేసి
యింద్రజిత్తు మెల్ల నింటి కేగి. ౪౮

సీ. అర్కుని తేజంబు హ్రాసమొందిన రీతి
నర్కజు తేజంబు హ్రాసమొందఁ
జంద్ర వికాసంబు సన్ననౌగతి రామ
చంద్రవికాసంబు సన్నగిల్ల
జలవృష్టిపోలిక శరవృష్టియెల్లెడ
నిబిడంబుగా మఱి నెగడఁ జేసి
పృథుమేఘ మంతట వెలిఁ బోయిన భంగిఁ
బృథుమేఘనాదుండు వెలిఁ జనఁగ
గీ. నలము పోలిక నలుఁడును నలఁగి పోయెఁ
గుముదముల భంగిఁ గుముదుండు కుందువడియె
జలము గతిఁ గపికులమును సంచలించెఁ
బ్లవగవాహిని వాహిని వరుస నొప్పె. ౫౦

గీ. జాంబవంతునియోగంబు సరణి నేగి
పవనసుతుఁ డంత నోషధి పర్వతంబుఁ
దెచ్చె నవలీల సేవకుఁ దీరె మూర్ఛ
యమరు లత్యంతమోదంబు నందిరపుడు. ౫౧

గ. మరల మహాయుద్ధంబు ప్రవర్తిల్లె నందుఁ బ్రకంప ప్రజంఘు లంగదు భుజప్రతాపానలంబునకు శలభంబులైరి. మైందద్వివిదులచే శోణితాక్షవిరూపాక్షులు మృతినొందిరి. ఇది గాంచి రోషావేశులై కుంభ నికుంభులు సుబాహు మారీచుల భంగి బాహులం జాఁచి రాఘవబాహుతుల్యులగు హనుమత్సుగ్రీవులం దాఁకి,

గీ. కుంభుఁ డినజుచేఁ గూల నికుంభుఁ డావి
యోగమోర్వక తన్నామ యుక్తమైన
విబుధసుందరీకుచకుంభవీథిఁ జేరె
శ్వసనపుత్రునివలనఁ దా నుసురు వాసి. ౫౨

గ. తదనంతరం బాసురపతి నియోగంబున ఖరాత్మజుండగు మకరాక్షుం డఖిలాసురవాహినీసమేతుండై వచ్చి విజృంభింప రఘువీరు సాయకంబు వానిం దాఁకి తండ్రి పజ్జ కంపె. తదనంతరము,

ఉ. రావణి తండ్రియానతి శిరంబునఁ దాలిచి యగ్ని వేల్చి య
స్త్రావలిఁ జేతఁ బూనుచు రయంబున మింటికిఁ బ్రాఁకి మాయచే
నావనచారిసేనపయి నమ్ములు మెండుగఁ గుమ్మరించి రా
మావనిపాలు కోపమున నాఁగఁగఁ జాలక పాఱ నింటికిన్. ౫౩

—* ఇంద్రజిత్తు మాయసీతను నఱకుట *—

వ. రావణి యావగిదిఁ బలాయితుండై లంకం జేరి మరలఁ బశ్చిమప్రతీహారంబునుండి వెడలి వచ్చి యాంజనేయుండు చూచుచుండ మాయాసీత నొకదానిని ఖడ్గంబున ఖండించి నికుంభిలాఖ్య ప్రదేశంబున కరిగి వైరిపశువిశసనారంభంబునకై చిత్రం బగు సత్రం బొకటి యారంభించె. హనూమంతుం డామాయాకల్పితసీతాఖండనంబు తథ్యం బని నమ్మి పోరు టుడిగి నిరాశుండై రామునొద్దకుఁ జని యది నివేదింప వజ్రనిర్ఘోషంబు విన్న రాజహంసంబు రీతి నారాజహంసంబు మూర్ఛిల్లి పుడమిపైఁ బడి సౌమిత్రి సాంత్వనంబులఁ గొంతవడికి లేచి దైన్యంబు గా నిట్టూర్పు నిగిడించి జగన్నాథుం డయ్యు ననాథుసింబోలె నిట్లు విలపించె.

గీ. జనన మందెను జనకుని సవనభూమి
నరణియందునఁ బొడసూపు నగ్నియట్లు
మనుకులంబునఁ గోడలై ఘనత నొందె
నట్టి సతిఁ బాసి యింక రాముఁ డెట్టు లుండు. ౫౪

ఆ. వె. వాయుపుత్రకుండు బలిమి దాఁటఁగ లేని
కడఁక నలుఁడు నడ్డు కట్టలేని
చిచ్చురమ్ము లింకఁ జేయంగఁ జాలని
మేటి శోకజలధి దాఁటు టెట్లు. ౫౫

వ. అంత నాసురమాయావేది యగు విభీషణుండు రాఘవుం జేరఁ “మీరీరీతి విలపించుటకుఁ దగిన కారణంబు లేదు. ఇది యంతయు యజ్ఞంబు నిరంతరాయంబుగ నొనర్పం బూని శక్రవైరి పన్నినపన్నుగడ కాని నిక్కంబుగా” దని వక్కాణించి తత్క్షణంబ లక్ష్మణుం బురస్కరించుకొని సేనాసమేతుండై యింద్రజిత్తుం జంప నికుంభిల ముట్టడించె.

—*ఇంద్రజిత్తు లక్ష్మణునితోఁ బోరిచచ్చుట*—

చ. వరశరపీనసేన యీ యుపు బపారములై చెవిసోఁకినంత ని
ర్జరపతి వైరి యాహవము చయ్యన నిల్పి మృగాధిరాజు గ
హ్వరముకు వీడివచ్చు గతి నాహవరంగముఁ జేరి మేటివా
నరబల మెల్లఁ దోలెను ఘనంబగు వాయువు తూలముంబలెన్. ౫౬

వ. అంతసౌమిత్రి గంధవహనందను స్కంధం బెక్కి స్యందనగతుండై సాంవర్తసమయకృతాంతుఁడుపోలెఁ బోరుచున్న సంక్రందనజిత్తును సంక్రందనుండు జంభుఁదాఁకినట్లు తాఁకి నిశితశరధారలా తనిపైఁగురిపించె నిట్లు.

ఉ. కోపము లుప్పతిల్ల మదగుంఫిత విస్ఫురదుగ్ర వీరస
ల్లాపము లెచ్చఁగా భుజబలంబులు మీఱఁగఁ గంకటంబులుం
జాపము లస్త్రములు ల్తునుఁగ జంకుట యుబ్బుట గానరాక యా
టోపమునం బెనంగిరి కడు న్సురవైరియు రాముతమ్ముఁడున్. ౫౭

గీ. వజ్రతుల్యంబులైనట్టి బాణచయము
చేతసౌమిత్రి యాయింద్రజిత్తు నారి
ముందుగాఁ ద్రుంచి పిదపఁ దత్స్యందనంబు
నడుపుసారథి నల్లన మడియ నేసె. ౫౮

వ. ఇట్లు సౌమిత్రియు నింద్రజిత్తును మూఁడు దినంబులు పోరిరి. అంత వక్రుండగు నాశక్రవైరి విభీషణునిపై శక్తిం బ్రయోగింప రామానుజుండు దాని నర్ధచంద్రబాణంబున ఖండించి వైరియవినయంబు బోర్వం బాలక యమోఘంబగు మాఘవతాస్త్రంబు వానిపైఁ బ్రయోగింప,

గీ. శక్రవైరిపైఁ బడియె నస్త్రంబుతోలుతఁ
బిదపఁ బడె వాని పెందల పృథివియందు
సురలు కురిసిరి కుసుమంపుసోన తోలుత
నసురకాంతలు విడిచిరి యశ్రు లవల. ౫౯

చ. తనయుని చావువార్త చెవిఁదాఁకిన రావణుఁ డెల్లమోములు
న్వనటను వాడఁ గన్గవల బాష్పము లుబ్బి స్రవింప నంతలో
ఘనమగుకోపపుర్ భరము క్రమ్ముడుఁ గన్బొమ లల్లనాడ నా
ననములు జేవురింప ఘననాద మొనర్చెఁ దనర్చినవ్వుచున్. ౬౦

వ. ఆటోపించి యానిశాటాధీశుండు సంక్రందనజిదాది నందనులు క్రమం
మటయుఁ గుంభకర్ణాదిభ్రాతలు వీతజీవులగుటయుఁ బ్రహస్తప్ర
ముఖ సచివవర్గంబు నిర్గతాసులగుటయు విరూపాక్షుండు మొద
లగు సేనాపతులు చచ్చుటయుఁ బ్రబలంబగు నిజబలంబు కలంగి
వికలంబగుటయుం బురంబు నిశాచరవనితాక్రందనపూరితం బగు
టయుం గాంచి హర్యక్షంబు హరిణంబుం జంపు తెఱంగున ధరణీసు
తం జంప నుంకించి యొద్దనున్నమంత్రి వారింప నాకృత్యంబు మాని
విధిసారథి సంచోదితుండై దాశరథిం దాఁక సంగరాంగణంబుం జేరె.

గీ. బహువిధాస్త్రంబులం దాల్చి పటిమ మీఱ
సంగరక్షితిఁ జే నిశాచరేశుఁ
డొక్కఁడయ్యును బెక్కురయోజఁ బోలెఁ
బెక్కుచేతులఁ దలలును వెలయుకతన. ౬౧

గీ. అరిబలంబున నున్నట్టి యరిదిమగలఁ
బేరు లుగ్గడించుచుఁ జంపె వేఱువేఱ
నీకు నీతఁడు వఱి వీఁడు నీకు ననుచు
వరుల సురవేశ్యలకునెల్లఁ బంచినట్లు. ౬౨

వ. ఈగతి లంకాపతి కపిసేనం గూల్చుటం జూచి కుపితుండై లక్ష్మణుం
డు నిశితవిశిఖమ్ముల రావణుకేతనమ్ము నర్ధచంద్రసాయకమ్మునఁ
జాపంబును నఱికి సారథిం జంపి కరలాఘవం బతిశయిల్ల నెల్లెడలఁ
దానయై వర్తిల్ల నసురపతి శక్తిం బ్రయోగించి యుపరాగము
కళాధరుంబోలె నాతని క్షణమాత్రంబు విసంజ్ఞుం గావించె.

—: రామరావణయుద్ధము. :—

గీ. తమ్ముఁ డారీతి శక్తిఘాతమ్మువలన
సోలుటం జూచి రాముండు చాలఁగుంది
ఖండలించెను జాపంబు ఖండలించె
విధియు దనుజనాయకు ఫాలవీథిలిపిని. ౬౩

గీ. అస్త్రధారల దనుజుని నాశుగముల
సురవిపక్షింద్రుఁ గ్రమ్మె దాశరథి నెఱపెఁ

గరుణావీరరసము లేక కాలమందు
శోకహర్షముల్ ప్రబలె ననీకమందు. ౬౮

గీ. ఈసు మీఱంగ రఘుకులాధీశుఁ డపుడు
చాపమును వంచి బాణముల్ జాలఁగురియ
నసుఱువాయక యున్నట్టి యసురభటుఁడుఁ
బ్రియునిఁ బడయనివేల్పుఁటింతియును లేర. ౬౯

గ. అంత హనుమంతుండు తెచ్చిన యోషధీపర్వతమాహాత్మ్యంబునఁ దమ్ముండు మూర్ఛదేఱం గని యత్యంతానందంబు నంది యాఖండలుం డంపిన కవచంబు దొడిగి విశంకటంబగు తత్స్యందనం బెక్కి సంరంభంబొప్ప రఘువీరుండు రణంబునకుం దొడరె నప్పుడు.

సీ. సమమైనలక్ష్యంబు సమకూరుటం జేసి
శౌర్యాతిరేకంబు జాలువాఱ
నన్యోన్య మస్త్రాళి నంటఁదాఁకుటచేత
నొడలంతఁ బులకలు పొడముచుండఁ
బ్రాణంబుమీఁదికి వచ్చినప్పుడుఁ గూడ
సమరంబు నిలువక సాగుచుండ
మూర్ఛచే వివశత మొనసినప్పుడుమాత్ర
మించుక విశ్రాంతి యేర్పడంగ

గీ. మేటిమగ లాట నొండొరు మెచ్చుకొనుచు
నొకరికొకరు తీసిపోకుండ నల్ల
రాఘవేంద్రుండు రాక్షసరాజు నప్పు
డెడము లేకుండఁ బోరిరి కడిమి మెఱయ.

గీ. రాముఁ డమ్ములఁ బొదినుండి లాగికొంట
యల్లెఁ దొడుగుట విడుచుట యున్నవనుఁ
జూచుచుండిన జనముల చూడ్కులట్టె
నిలిచె రఘువీరుకరమున నిండు వెఱను. ౬౭

ఉ. బీరములాడుచున్న సురవిద్విషువక్త్రము రాఘవేంద్రు దు
ర్వారశరంబుచేఁ దెగియు వారక వల్కుచునుండె శౌర్యమం

దారయనొక్కరూపయగు నారణధీరయుగంబునందు దే
వారియ చిన్నప్రాయె శిర మాగతి వ్రాలుట గన్నసిగ్గునన్. ౬౮

ఉ. ఆసురనాథు నాశుగము లంటఁగఁ దాఁకినఁ బుట్టి రక్తము
ల్వాసవకంచుకాక్షిశతపంక్తులఁ జొచ్చి స్రవించుచుండఁగా
భూసుతనాయకుం డెసఁగెఁ బోల్పఁగఁ గోవకషాయితంబులై
భాసిలుకన్నులన్నిట విసత్తు బలుం గను వజ్రిపోలికన్. ౬౯

గ. ఈరీతి నత్యాగ్రహంబుతో నొండొరులం దాఁకి వైశ్వానరాస్త్రంబు వారుణాస్త్రంబునను, నాగాస్త్రంబు గారుడాస్త్రంబునను, శారిదాస్త్రంబు వాయవ్యంబునను, దామిస్రంబు వైభాకరంబునను, దానవంబు మహేంద్రంబునను, వైష్ణవంబు మహేశ్వరంబునను, నీగతి నన్యోన్యాస్త్రంబుల ఖండించుచు నిముసం బైన విడువక రఘువరుండు నసురవరుండు నేడుదినంబులు పోరిరి. అంత,

—: రావణుఁడు చచ్చుట :—

ఉ. చాపవినోదముం జలుపఁ జాలసముత్సుకుఁడయ్యు రాఘవుం
డాపద నున్న జాయఁ గని యబ్జభవాస్త్రము పేర్చి యా
పాపునికంఠము ల్వదియు భగ్నమొనర్చెను సర్వలోకసం
తాపము నాక్షణంబునన నాశము నొందె జగంబు లుబ్బఁగన్. ౭౦

గీ. అసురనాథుండు చచ్చిన నమరు లుబ్బి
పుష్పవర్షంబు గురిసిరి పుడమిపైనిఁ
దొలుతఁ జుప్పనాతి మనసు కలఁచినట్టి
కాముఁడు న్నుతి గాంచెను రాముతోడ. ౭౧

గ. అంత రణరంగంబున నిషంగం బుపధానంబుగా శరతల్పంబున శయనించియున్న యన్నం జేరి సోదరస్నేహంబునం బుడమింబడి విభీషణుం డిట్లు విలపించె.

—: అన్నచావునకు విభీషణుఁడు విలపించుట :—

చ. సమసుఖదుఃఖభావమున సాటిసిశాటులు నిన్నుఁగొల్చి యీ
సమరముఖంబునందుఁ బడిచచ్చిరి తమ్ముఁడనైన నేను ధ
ర్మము విడనాడి ని న్విడిచి మాన్యకులంబును మాపినాఁడ నీ
యమితకళంక మెన్నఁటికి నైనను నాకిఁక మాయునే భువిన్. ౭౨

గీ. నిన్ను రక్షింపఁ జోరుచు నిహతిఁ బొంది
ధన్యుఁడౌ కుంభకర్ణుండు తమ్ముఁ డనఁగ
నాత్మలాభంబుఁ గోరి నీ హితమొనర్చె
నట్టిపాపుని నను విధి యిట్లు లుంచె. ౭౩

వ. అనంతర మంతఃపురాంగనలతోఁ గూడి కరుణంబుగా నాక్రందించుచు మందోదరి సమరాంగణంబుఁ జేరి యశనినిహతమందరంబు చందంబునం బడియున్న నిజేశు దశకంధరుం గాంచి నిషాదుండు దయితుం జంప విలపించు కురరీకరణి నీరీతి నారటించె.

—* మందోదరివిలాపము. *—

గీ. పూర్వ మఖిలదిగ్విజయం బపూర్వరీతిఁ
జేసి సురముతోడుతఁ బ్రవేశించినట్టి
జమునిపురి కిప్డు సామాన్యజననిభంగి
నరిగినాఁడవు విధి నేమియనఁగవచ్చు. ౭౪

ఆ. దనుజవంశనాయకుఁడైన ఘనుఁడు తండ్రి
జగము లెల్ల గెల్చిన మేటిమగఁడు మగఁడు
అమరవరుని జయించినయతఁడు సుతుఁడు
దైవ మిపుడట్టినను నిట్టిదశకుఁ దెచ్చె. ౭౫

గీ. వాలిమొదలుగ నగ్రజుఁ గూలనేసి
తమ్మునకు రాజ్యమిచ్చుట ధర్మవిదుఁడ
యయిన నితనికిఁ బరిపాటి యయ్యె నకట
తరణికులజుల కిది యెట్లు ధర్మ్యమయ్యె. ౭౬

వ. అంత నిజనాథు నుద్దేశించి

ఉ. వానరవీరవాలగతవహ్ని దహించెను లంక నెంతయున్
జానకి శీలమన్శిఖిని జచ్చితి వీ విదె యేను దీవ్రశో
కానలమధ్యమందుఁ గడు హాయిగనుంటిని జావులేక వై
శ్వానరుఁడు న్ననుం గదిసి చంపఁగఁ జాలఁడటంచు నెంచెదన్.

వ. సాయందినంబున దివాకరప్రభ వోలె నేనిప్పు డనలంబు సొచ్చి చంద్రిక చంద్రునిఁ జపలాలత మేఘంబు ననుసరించు పగిది నిన్నను

సరించి యీదారుణ విరహవ్యథఁ బాపుకొనియెద ననుచు నిట్లు విలపించు ప్రజావతి యాత్మహత్యోద్యోగంబును మాన్పి తనయను మతి నన్నకు యథావిధిగాఁ బితృమేధంబు నిర్వర్తించియున్న విభీషణు నఖిలాసుర రాజ్యాధిపత్యంబునకు రఘుపతి యభిషిక్తుం గావించె.

క॥ తరణికులోద్వహదత్తా
సురనాయకమండలంబు సొంపొందెఁ గదా
దరణికిరణామృతంబున
మఱిమఱిఁ బెంపొందుచంద్రమండలము గతిన్. ౭౮

గ. అంత.

—+ సీతయగ్నిప్రవేశము *—

గీ॥ శుద్ధుఁడైనవిభీషణుం డిద్ధభక్తి
నింతులకు నెల్ల నరిది మేల్బంతి యైన
సీతఁ గొనివచ్చి రామునిచెంత నిలుప
హర్షశోకంబు లుప్పొంగ నతనిమదిని. ౭౯

గ॥ అనంతర మరుంధతింబోలెఁ బవిత్రచారిత్రనిధి కధిదేవతయగు వైదేహి పరమపురుషుం డయ్యు మర్త్యరూపంబుఁ దాల్చిననిజేశు విశ్వాసార్థంబుగా నరవిందాసనుండును బురందరాదిసురలును జూచుచుండఁ జంద్రకల చండభానుమండలంబుం జొచ్చుభంగిం జిచ్చునం బడె.

గీ॥ ఆత్మశుద్ధికై జానకి యగ్నిఁజొచ్చెఁ
గాని తచ్ఛుద్ధచరితంబు కతన నతఁడు
సర్వభక్షణపరతచే సక్తమయిన
యఘము పోలివ్రోవఁ బరిశుద్ధుఁ డయ్యె నపుడు. ౮౦

క॥ అనలవిశుద్ధయయినభూ
తనయను రాముండు ప్రేమ దనర గ్రహించెన్
అనలవిశుద్ధ యయినప్రభ
నినుఁడు ప్రభాతంబునన్ గ్రహించినభంగిన్. ౮౧

—*సీతారాములు పుష్పకంబెక్కి నందిగ్రామంబున కేగుట*—

వ. తదనంతరం బారఘువీరుం డరవిందయోని చూపింప నాకాశమం దున్న దశరథుంగాంచి ప్రణమిల్లి తదనుజ్ఞ శిరంబునం దాల్చి పాక శాసను వరంబునం బ్రత్యుజ్జీవితు లగువానరులం గని యానం దించి సుగ్రీవునితో భాషించుచుండిన విభీషణు సకరుణంబుగా నాలోకించి సీతాసౌమిత్రిసహితంబుగా నయోధ్యకుం జనం గామ చరంబగు కుబేరపుష్పకం బెక్కె.

చ. అరుదగు నావిమాన మతిహర్షముతో డుత నెక్కిపోవుచు
న్నరరిపు వీటిచెంతఁ గలచోటుల నావల నాగభీరసా
గరమును దానియందు మునుగట్టిన బంధురసేతుబంధము
న్వరుసగఁ జూపుచుం జలజబంధుకులీనుఁడు జాయ కిట్లనున్. ౮౨

గీ. పుష్పకంబిదె మీఁదికిఁ బోవుకొలఁది
నాకసంబు విశాలమై యతిశయిల్లు
నవనిఁ బల్వలాకృతి నున్నయబ్ధిఁ జూపి
పవనసుతు గేలిగొందుకు ప్లవగు లిదిగొ. ౮౩

వ. జనకనందిని యీవిమానవేగంబు వినతానందను వేగముం గూడ నతిశయించుచున్న దిదిగోఁ జూడుము.

క. దూరమున నున్నవానిని
నేరుపటిచి నీకుఁజెప్ప నేఁ దలఁచిన నా
నేరుపు లన్నియు వమ్మై
దూరముగా నవి వెనుకకుఁ దొలఁగెడు కతనన్. ౮౪

వ. ధరణితనయా చూడు, మది ఋష్యమూకం, బయ్యది పంపానరస్సు కబంధుఁ జంపిన తావయ్యది, యద్దిఖరాసురకలహాస్థానంబు, మఱి యయ్యది మన పర్ణశాల, మాయామృగంబును వేఁటాడిన వనమద్ది, యది పావనయగు గోదావరీసరిద్వరం, బల్లది కుంభసంభ వముని యాయతనం, బది పరాధ విధ్వంసనభూమి, యది యత్రి ముని యాశ్రమం,బిది చిత్రకూటము అని యాప్రదేశంబులం జూపు

చు రాఘవుండు భాగీరథీపరిసరంబునందున్న భరద్వాజాశ్రమముం
జేరిమైథిలితో నిట్లనియె.

గీ. నిద్రపోవుచు నున్నట్టి నెమ్మి శ్వాన
వాయువును గ్రోలి సొక్కెడుఁ బన్నగంబు
మేటి కండూతి పోవంగ మృగము మేను
గోఁకికొనియెడు సింహంబు గోళ్లతోడ. ౨౫

వ. అంత భరద్వాజమహర్షి విహితాతిథ్యం బందుకొని మరలఁ బు
ష్పకం బెక్కి చనిచని యయోధ్యాపురసమీపంబుం జేరి యంతకు
ముందుగా వాయునందనుచే నన్న రాక విని యతిపావనతపోధన
వ్రతుండు నాజానభక్తిభరితుండు నగు భరతుండు మంత్రిసహి
తుండై వసిష్ఠుం బురస్కరించుకొని యెదురురాఁ గాంచి వాత్సల్యం
బున విమానంబు దిగం దలంచిన మాత్రాన నాయానంబు క్రింది
కిఁ బోవుచుండ జానకితో రఘుపుంగవుం డిట్లనియె.

గీ. నాదుభావంబు నెఱిఁగెనో నాఁగ, బుష్ప
కంబు క్రిందికి దిగియెడు క్ష్మాతనూజ
నీవు వచ్చుట గాంచి తా నిన్నుఁ గదియ
నాదరంబున వచ్చు నీయమ్మ యిదిగో. ౨౬

గీ. ఇందుముఖతోడ లీలగా నిట్టు లనుచు
వానరాధిపు హస్తంబు పట్టుకొనుచు
దనుజపతి దారిచూపంగ ఘనవిమాన
మల్లన డిగియె జానకీ వల్లభుండు. ౨౭

—*శ్రీరామ భరత సమావేశము*—

ఉ. ఆగతిఁ బుష్పకంబు డిగి యన్న కనంబడినంతఁ బాదుక
ల్వేగమ ముందుఁ బెట్టుకొని వేమఱు మ్రొక్కెడు పెద్దతమ్ముని
గాఁగిట గ్రుచ్చిగ్రుచ్చి యధికంబుగ డస్సిన వానికాయమ
రాగముతోఁ గడు న్నిమిరె రాఘవుఁ డశ్రుల నీరుక్రమ్మఁగన్. ౨౮

గీ. ఆర్యసమదుఃఖకృశదేహుఁడైనతమ్ముఁ
గాంచి భరతుండు ముదముతోఁ గౌఁగిలించె

నతఁడును సుఖోపనతరాజ్య మవలఁ ద్రోచి
సుదృఢభక్తిఁ బూనిన యన్నఁ జూచి తనిసె. ౮౯

౫. అంత శత్రుఘ్నసహితుండై భరతుండు సీతాదేవికి నమస్కరించి సుగ్రీవ విభీషణాదుల యథోచితోపచర్యల గౌరవించె. రాముం డును వసిష్ఠుం బూజించి మంత్రుల నామంత్రించి పౌరవర్గంబు నను గ్రహ పూర్వకంబుగాఁ గనుంగొని సీతాలక్ష్మణసహితుండై భర తాశ్రమంబునకుం జని యచ్చటనతిలోభనీయ వాత్సల్యయగు కౌసల్యకు దుఃఖాతిరేక యగు కైకకు నత్యంతస్నేహపరివ్యక్త యగు సుమిత్రకును గ్రమానుసారంబుగా నభివాదనం బొనర్చి వారలు తన్ను మాటిమాటికిఁ గౌఁగిలించుచుండ నమందానందభరి తుండయ్యె. అంత,

—శ్రీరామపట్టాభిషేకము—

గీ. శిష్టరీతిని బట్టాభిషేచనంబు
గురువులాజ్ఞను గావింపఁ గోరి సకల
తీర్థజల మమందగతిని దెచ్చిరపుడు
కపులు మంథర మది యెంతొ కలఁతఁ జెంద. ౯౦

గీ. మంత్రివర్గంబుచే నటు మకుటబంధ
మాదరంబునఁ బొంది రామాధిపుండు
పురికిఁ బోవఁగా రథమెక్కె భూరిరథుఁడు
భరతుఁడును మనోరథముఁ దాఁ బడసె నపుడు. ౯౧

—సీతారాము లయోధ్యఁ బ్రవేశించుట—

సీ. సౌమిత్రు లిద్దఱు చామర ల్వీచుచు
నెలవంక బలవంక లెనసి కొలువఁ
బరిజనాచారుఁడై భరతుండు భక్తితో
విమలముక్తాతపత్రమును బట్ట
వానరదానవవాహినీనాయకుల్
వినయంబుతోడుత వెంట రాఁగ

దిక్కులు మిక్కిలి పిక్కటిల్లఁగఁ దూర్య
నినదంబు లెల్లెడ నివ్వటిల్లఁ
గీ॥ పౌరభామలు వీక్షణపంక్తిచేతఁ
గలువపూవులతోరణంబులను గట్ట
జనకనందనతో రామజనవిభుండు
పొలుపుమీఱంగ సాకేతపురము సొచ్చె. ౯౨

గ. ఈ రీతిని.

చ. అని జయ లక్ష్మిఁ జేతఁగొని యాప్తుల భానుతనూభవు న్విభీ
షణు నిజరాజ్యపీఠముల సమ్మతి నిల్పి ప్రియానుజుత్తమి
న్వెనుకొని రా నయోధ్యఁ గడు వేడుకఁ జొచ్చి సుఖంబుతోడ భూ
తనయను గూడి దాశరథి ధారుణి యేలెను గీర్తిలోలుఁడై. ౯౩

ఇది శ్రీమత్కౌశిక గోత్రపవిత్ర జయంతివంశ
రత్నాకర సుధాకర రామయ నామధేయ
ప్రణీతాంధ్ర చంపూరామాయణంబు
నందు యుద్ధకాండము
సర్వము సంపూర్ణము.



## పీఠిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 14 | మావమో | మావయో |
| | 15 | పాత | పాతః |
| 2 | 2 | పద్య | పద్య |

## కృతిసమర్పణము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 5 | యేటను. | యేఁటను. |

## గ్రంథము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 19 | అంతర్గానుండయ్యె | అంతర్ధానంబయ్యె |
| 5 | 3 | దివణ | ధివణ |
| | 20 | సిత | స్థిత |
| 7 | 3 | అంతర్ధానుండయ్యె | అంతర్ధానంబయ్యె |
| | 13 | ఒకందూద్భవించి | ఒకండుద్భవించి |
| 8 | 27 | ఆదరమునబూని | ఆదరమునఁబూని |
| 11 | 6 | వేయిజగంబులు | వేయిగజంబులు |
| | 24 | చెఁనటి | చెనఁటి |
| 14 | 11 | దాశరధి | దాశరథి |
| 16 | 22 | మెట్టికేలకు | మెట్టకేలకు |
| 17 | 1 | నిర్బర | నిర్భర |
| | 4 | సుస్థరమతి | సుస్థిరమతి |
| | 6 | దిలీపుడు | దిలీపుఁడు |
| 20 | 26 | మాహాత్తము | మాహాత్మ్య శ్రీ |
| 21 | 26 | నిమ్మునిరుండు | నిమ్ముని వరుండు |
| 24 | 6 | మానపోత్సవము | మానసోత్సవము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 26 | –1 | నిమికులాదీశు | నిమికులాధీశు |
| 37 | 24 | భావంబ | భావంబు |
| 39 | 11 | నిశిధినీ | నిశీధినీ |
| 40 | 23 | మైసట్టి | మైనట్టి |
| 46 | 12 | సత్పధంబు | సత్పథంబు |
| 47 | 19 | నథికంబు | సధికంబు |
| 53 | 2 | నివాసార్ధము | నివాసార్థము |
| 55 | 15 | సేననంబు | సేవనంబు |
| 70 | 19 | జగతిగలఁడె | జగతిఁగలఁడె |
| | 21 | మూాకమదు | మూాకమందు |
| 74 | 5 | దైర్యుఁడు | ధైర్యుఁడు |
| 77 | 10 | యిట | యిటు |
| 81 | 4 | పరిచ్చన్న | పరిచ్ఛన్న |
| | 8 | బాడుపుగుబ్బలి | పడమటి గుబ్బలి |
| 87 | 11 | ౨౬ | ౨౯ |
| 90 | 4 | జూడగ | జూడఁగ |
| 91 | 11 | దరగల | దరఁగల |
| | 23 | నేనుపితృ | నేనుబితృ |
| | 27 | సంఖ్యం | సఖ్యం |
| 93 | 14 | ఉగ్రకీతా | ఉగ్రసీతా |
| 94 | 9 | గీ | క |
| 95 | 25 | తేటులట్లు | తేఁటులట్లు |
| | 26 | మాన్పగా | మాన్పఁగా |
| 96 | 9 | దోక | దోఁక |
| | 24 | సువర్ణ | సుపర్ణ |
| 98 | 6 | దైర్యండు | ధైర్యండు |
| 98 | 16 | తారానంద | తారానందన |
| | 17 | హనూమంతోదయ | హనుమదుదయ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 99 | 16 | లోఁషు | లోఁతు |
| 100 | 3 | వ్యధిత | వ్యథిత |
| | 9 | నీతంబగు | సీతయగు |
| 104 | 3 | శారణులను | సారణులను |
| 107 | 22 | వినుపించు | వినిపించు |
| | 24 | దష్ట్రలం | దంష్ట్రలం |
| 111 | 4 | కిర్తి | కీర్తి |
| 113 | 17 | యుర్ధంబు | యుద్ధంబు |
| 115 | 6 | సమిత్రి | సౌమిత్రి |
| 116 | 10 | జే | జేరి |
| 117 | 10 | రణబు | రణంబు |
| 119 | 13 | విథి | విధి |



